# పీ ఠి క

చైనా ప్రజా రిపబ్లిక్ అవతరించి నాలుగేండ్లయింది. ఒక దేశ చరిత్రలో నాలుగేండ్లు అతి స్వల్పకాలం మాత్రమే. కాని యీ పరిమిత కాలంలోనే మొన్న మొన్నటి వరకు అర్ధవలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థకు నిలయమై, అజ్ఞానాంధకారాలకు ఆలవాలమై, సామ్రాజ్యవాదుల దురాక్రమణకు, దోపిడీకి ఆటపట్టయి అర్ధబానిసత్వంలో మ్రగ్గుచుండిన చైనాలో చరిత్రాత్మకమైన మార్పులు తీసుకురాబడ్డాయి. వ్యవసాయంలో, పరిశ్రమలలో, వర్తకవాణిజ్యాలలో, ప్రజాజీవితంలో, సంస్కృతీ వైజ్ఞానిక రంగాలలో అపూర్వమైన అభివృద్ధి సాధించబడింది. అర్ధవలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థ పూర్తిగా తుడిచిపెట్టబడింది. సర్వస్వతంత్ర స్వేచ్ఛాయుత నూతన ప్రజాస్వామిక వ్యవస్థ నెలకొల్పబడింది. వెనుకబడియున్న వ్యావసాయిక దేశాన్ని బలవత్తరమైన పారిశ్రామిక దేశంగా తయారు చేసేందుకు పునాదులు వేయబడ్డాయి.

నవచైనా సాధించిన ఈ విజయాలన్నీ తేలికగా సాధించబడ్డాయనుకోవడం పొరపాటు. చైనా ప్రజానీకం అనేక అడ్డంకులను, అవాంతరాలను ఎదుర్కోవలసి వచ్చింది.

పదేండ్లుగా సాగిన జపాన్ వ్యతిరేక, కుమింటాంగ్ వ్యతిరేక యుద్ధ దుష్ఫలితాలను రూపుమాపవలసి వచ్చింది. కుమింటాంగ్ దుష్పరిపాలనా ఫలితాలైన నోట్లముమ్మరాన్ని, అధికధరలను, చట్టా వ్యాపారాన్ని, అవినీతిని, లంచగొండి తనాన్ని నిర్మూలించవలసి వచ్చింది. వీటికి తోడు అమెరికా విధించిన ఆర్థిక దిగ్బంధనాన్ని ఎదుర్కొని నిలబడవలసివచ్చింది. కొరియాలో అమెరికాయొక్క దురాక్రమణ యుద్ధాన్ని ప్రతిఘ టించ వలసి వచ్చింది.

అయినప్పటికీ చైనాప్రజానీకం కమ్యూనిస్టుపార్టీయొక్క, ప్రజానాయకుడైన మావో సే-టుంగ్ యొక్క నాయకత్వం క్రింద సాటిలేని సాహసాన్ని, అకుంఠిత త్యాగాన్ని ప్రదర్శిం చారు. కష్టాలను లెక్క-చేయక పట్టుదలతో కృషిచేసి అత్యా ద్భుతమైన విజయాలను సాధించారు.

నవచైనా సాధించిన ఆర్థికవిజయాలను వివరించడమే మాయొక్క ఆశయం. విప్లవానంతరం చైనాలో సాధించబడిన విజయాలు, "స్వాతంత్ర్యా"నంతరం భారతదేశంలో ఎందుకు సాధ్యంగాలేదో పాఠకులర్థంచేసుకుంటారని ఆశిస్తున్నాము.

ఈ గ్రంథంలో 1952 అక్టోబర్ వరకు సాధించిన విజ యాలు మాత్రమే వివరించబడ్డాయి. 1953 లో నవచైనా మరింత పురోగమించిందనుట నిస్సందేహం.

— రచయిత

1

# భూ సంస్కరణలు

1949 అక్టోబర్ నుండి 1952 అక్టోబర్ లోపల చైనాలో 30 కోట్ల జనాభాగల పల్లెప్రాంతాలలో భూ సంస్కరణలు పూర్తి గావింపబడ్డాయి. 1953 లో అల్పసంఖ్యాక జాతుల ప్రాంతాలను టిబెట్, తైయువాన్ లను మినహాయిస్తే మిగతా విముక్త ప్రాంతాలలోగూడ పూర్తిచేయబడ్డాయి.

రెండువేల సంవత్సరాలకుపైగా దారుణమైన ఫ్యూడల్ దోపిడీవిధానంలో క్రుంగిపోతున్న చైనా రైతాంగం యెట్ట కేలకు విముక్తి చేయబడింది. ఒకప్పుడు భూస్వాముల క్రింద పశుతుల్యులుగా కష్టించిన రైతాంగం ఇప్పుడు పల్లెప్రాంతాల పరిపాలకులయ్యారు. ఒకప్పుడు భూమికి దాస్యంచేసినవారు నేడు దానికి అధినేతలయ్యారు. ఈ బ్రహ్మాండమైన, చరిత్రాత్మకమైన విజయం ఎలా సాధించబడింది?

ముప్పది సంవత్సరాలుగా రైతాంగానికి నాయకత్వం వహించి దానితో చేతులుగలిపి అచంచలంగాను, నిర్విరామంగాను చైనా కార్మికవర్గమూ, దాని పార్టీయైన కమ్యూనిస్టు

పార్టీ సాగించిన వీరోచిత పోరాటాల ఫలితంగా ఈ విజయం సాధించబడింది. కమ్యూనిస్టుపార్టీ, మావో-సే-టుంగ్‌లయొక్క సిద్ధాంత నాయకత్వమూ, రైతాంగ సమస్యపై మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల బోధనలు యీ విజయాన్ని సాధించుటకు తోడ్పడ్డాయి.

## భూసంస్కరణలు అమలుపరచబడిన విధానం

మూడేండ్ల పరిమితకాలంలో 30 కోట్ల జనాభాగల ప్రాంతాలలో భూసంస్కరణల నమలుపరచడం ఎలా సాధ్యపడింది ?

మొదటిది : బీద రైతాంగము, వ్యవసాయకూలీలపైన ఆధారపడి, మధ్యతరగతి రైతాంగంతో చేతులుగలిపి, ధనిక రైతాంగాన్ని తటస్థం గావించుటద్వారా క్రమబద్ధంగా, ఆయా స్థానిక పరిస్థితులను జాగ్రత్తగా గమనిస్తూ, ఫ్యూడల్ దోపిడీ విధానానికి స్వస్తిచెప్పి, వ్యవసాయికాభివృద్ధికి మార్గం సుగమం చేయవలసి యుంటుందని మావో-సే-టుంగ్, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ చెబుతూవచ్చారు. వీరు సూచించిన యీ సాధారణ విధానాన్ని తూ చా తప్పకుండ అమలుపరచడం ద్వారానే భూసంస్కరణోద్యం జయప్రదమయింది.

పల్లెటి జనాభాలో 70% వరకు ఉన్న భూములు భూములులేని లేక భూదాహంగల బీదరైతాంగము, వ్యవసాయకూలీలు భూసంస్కరణోద్యమంలో పునాది వర్గాలుగా ఉంటారని చైనా భూసంస్కరణోద్యమానుభవం రుజువుచేసింది.

భూసంస్కరణోద్యమంలో వీరు అత్యంత ఉత్సాహంగాను, దృఢంగానుపనిచేశారు. వీరిలో అధిక భాగం స్థానిక రైతుసంఘాలలో నాయకులుగా వ్యవహరించారు. వీరిపైన ఆధారపడుట ద్వారానే ఫ్యూడల్ వ్యవస్థ జయప్రదంగా తుడిచిపెట్టబడింది. గ్రామసీమలలోని యితర రైతుకుంటుంబాలలో ఒక్కొక్కరికి గల సగటు భూమిలో దాదాపు 90% వరకు వీరిలో ఒక్కొక్క కుటుంబానికి లభించింది. ఈవిధంగా వీరియొక్క భూదాహం ప్రాథమికంగా సంతృప్తి పరచబడింది.

భూసంస్కరణోద్యమంలో గ్రామీణ జనాభాలో 20% గా ఉన్న మధ్యతరగతి రైతాంగంయొక్క ప్రయోజనాలుకూడా జాగ్రత్తగా రక్షించబడ్డాయి. వ్యవసాయ సంస్కరణచట్టంలోని 7 వ ఆర్టికల్ ప్రకారం "మధ్యతరగతి రైతాంగం యొక్క భూమి, తదితర ఆస్థులు (పచ్చగాఉన్న మధ్యతరగతి రైతాంగంతోసహా) కాపాడబడతాయి" అనే సూత్రం ప్రతిచోటా ఖచ్చితంగా అమలుజరుపబడింది. సగటు పరిమితిని మించిన భూమిగల మధ్యతరగతి రైతులభూమి అలాగే ఉంచబడింది. చాలీచాలని భూమిగల మధ్యతరగతి రైతులకు అదనంగా కొంతభూమి యివ్వబడింది. ఈ విధంగా సంస్కరణలకు పూర్వం ఒక్కొక్క మధ్యతరగతి రైతు కుటుంబానికిగల సగటుభూమికన్నా యీనాడు వారికిగల సగటుభూమి పెరిగింది. ఈ ఉద్యమానికి ముందుగానే కౌలు తగ్గింపువలన, భూస్వాములకు కౌలు నిమిత్తం ముందుగానే డిపాజిట్ చేయబడ్డ మొత్తాలు తిరిగి యివ్వడం వలనకూడా మధ్యతరగతి రైతాంగం లాభంపొందింది. దీనితోపాటు రైతుసంఘాల నాయకత్వంలో మధ్యతరగతి రైతాంగ సభ్యత్వం మూడవ

వంతును తగ్గకుండా ఉండాలని నిర్ణయించబడింది. ఈ చర్యలన్నింటి ఫలితంగా గ్రామజనాభాలో 90% గా ఉన్న వ్యవసాయ కూలీలు, బీదరైతులు, మధ్యతరగతి రైతులమధ్య అభేద్యమైన ఐక్యసంఘటన ఏర్పడింది. ఈ విధానం వ్యవసాయ కూలీలూ, బీదరైతాంగమూ, మిగతా రైతాంగంనుండి వేరు పడిపోకుండా కాపాడటమేగాక భూస్వాములను కేటాయించి భూసంస్కరణలు జయప్రదంగా అమలుజరుపుటకు తోడ్పడింది.

ఇక ధనికరైతుల విషయంలో వారి ఆర్థికవిధానాన్ని యథాతథంగా అట్టిపెట్టే విధానం అనుసరించబడింది. వ్యవసాయ సంస్కరణల చట్టంలోని 6 వ ఆర్టికల్ ప్రకారం "ధనిక రైతుల యాజమాన్యానగల భూమిగాని - వారు దానిని స్వయంగా చేస్తున్నా సరే లేక వ్యవసాయ కూలీలను వినియోగించి సాగుచేస్తున్నా సరే - వారి యితర ఆస్థులుగాని స్వాధీన పరచుకోబడవు." ఈ సూత్రాన్ని ఖచ్చితంగా అమలుజరపడం జరిగింది. భూసంస్కరణల పిమ్మట ధనికరైతుకుగల భూమి సాధారణంగా తన ప్రాంతంలో రైతులకుగల సగటుభూమికి రెండురెట్లు ఉంటుంది. కొన్ని ప్రాంతాలలో ధనిక రైతులు కౌలుకిచ్చుకున్న చిన్న చిన్న భూఖండాలుకూడా వారికే వదలివేయబడ్డాయి. ధనికరైతుయెడల అవలంబించబడ్డ యీ విధానం పూర్వం సాధారణంగా భూస్వామ్యవర్గానికి సహచరులుగా వుంటూవచ్చిన ధనికరైతాంగాన్ని యీ సంస్కరణోద్యమంలో తటస్థులను గావించి, భూస్వామ్యవర్గాన్ని మరింత కేటాయించి భూస్వామ్య విధానాన్ని రద్దుచేయుటకు తోడ్పడింది.

భూసంస్కరణల ఫలితంగా భూస్వామ్యవర్గం రద్దు చేయబడింది. దీని అర్థం భూస్వాములు భౌతికంగా తుడిచి

వేయబడ్డారనిగాదు. వ్యవసాయ సంస్కరణ చట్టంలోని 10 వ ఆర్టికల్ ప్రకారం భూస్వాములు తమ పరాశ్రయ జీవితాన్ని మార్చుకుని శ్రమచేయడం నేర్చుకుని తమనుతాము సంస్కరించుకునేందుకుగాను యితర రైతాంగంతో సమానంగ వారికి కూడ భూములు మంజూరు చేయబడ్డాయి. భూస్వాముల యొక్క ఫ్యూడల్ దోపిడి సాగిస్తున్న భూమి, తదితర ఆస్తులు మాత్రమే స్వాధీనం చేసుకోబడ్డాయి. కాని వారియొక్క పారిశ్రామిక, వ్యాపార సంబంధమైన సంస్థలనుగాని, ప్రత్యక్షంగా వాటిని కొనసాగించుట కవసరమైన ఆస్తులనుగాని స్వాధీన పరచుకోలేదు. అయితే హత్యలు చేయడంలాంటి క్రూరమైన నేరాలు చేయుటద్వారా ప్రజల కోపాగ్నికి గురియైనట్టి, అలాగే వ్యవసాయ సంస్కరణలను ప్రతిఘటించడం, విచ్ఛిన్నకర చర్యలు కొనసాగించడం మొదలైన చట్టధిక్కరణ నేరాలు చేసినట్టి భూస్వాములను, దుండగీండ్రను చట్టం ప్రకారం శిక్షించడం జరిగింది. తీవ్రమైన నేరాలు చేసిన వారు మాత్రమే ఉరితీయబడ్డారు.

క్లుప్తంలో చెప్పాలంటే వ్యవసాయసంస్కరణలచట్టంలో పొందుపరచబడిన విధానాన్ని, సూత్రాలను అనుసరించి వాటిని ఖచ్చితంగా అమలు పరచుటద్వారానే యీ అపూర్వ విజయాన్ని సాధించడం సాధ్యమైంది.

రెండవది : ప్రజాసామాన్యం యొక్క నాయకత్వం క్రిందనే విశాల ప్రజానీకాన్ని సమీకరించడమనే సూత్రం అమలుపరచబడింది. తత్ఫలితంగా నాయకత్వానికి ప్రజానీకానికి మధ్య ఐక్యత నెలకొల్పబడింది.

వ్యవసాయ సంస్కరణలు ఒక తీవ్రవర్గ పోరాటం ద్వారానే సాధ్యమవుతాయి. విశాల రైతు ప్రజాసామాన్యం యొక్క యథేచ్ఛాపూర్వకంగా జరిగినపుడే, వారు స్వచ్ఛందంగా భూస్వామ్యవర్గాల భూమిని స్వాధీనపరచుకొని వ్యవసాయకూలీలకు, బీదరైతాంగానికి పంచియిచ్చేందుకు ముందుకు వచ్చినపుడే యీ ఉద్యమం పూర్తిగా విజయవంతమవుతుంది. ఈ సమీకరణతోపాటు వారికి భూ సంస్కరణలకు సంబంధించిన ప్రభుత్వ చట్టాలను, విధానాలను వివరించి విజ్ఞానవంతులను గావించి సక్రమంగా నడిపించవలసి యుంటుంది. ఈ విజ్ఞానం భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో వారి కొక ఆయుధంగా పనిచేస్తుంది.

ఈ భారీ సమీకరణ కార్యక్రమాన్ని నిర్వర్తించేందుకుగాను అసంఖ్యాకమైన వ్యవసాయ సంస్కరణా నిర్వహణా దళాలు (Land reform work teams) నిర్మించబడ్డాయి. ఈ దళాలలో ప్రతిసంవత్సరమూ వివిధప్రాంతాలకు సంబంధించిన కార్యకర్తలు 3,00,000 మందికి పైగా చేర్చుకోబడి గ్రామసీమలకు పంపించబడ్డారు. ఈ దళాలు గ్రామాలలోని అణగారిన బీదప్రజలను కలుసుకుని వారి కష్టాలను నివేదించేటట్లు ప్రోత్సహించారు. రైతాంగ ప్రతినిధుల సమావేశాలు ఏర్పరచారు. రైతాంగంలోని ఉత్సాహవంతులను తక్కువ కాలపు శిక్షణాకేంద్రాలు నడిపి చైతన్యవంతులను చేశారు. మెట్టుకు పై మెట్టుగా వ్యవసాయకూలీలు, బీదరైతులతో గూడిన చిన్నచిన్న రైతుసంఘాలతో ప్రారంభించి క్రమంగా మధ్యతరగతి రైతులతో గూడిన విశాలమైన రైతుసంస్థలను నిర్మించారు. రైతులు తమ ప్రతినిధుల సమావేశాలలో తమ

పాత నికృష్ట జీవితాన్ని గురించి చెప్పుకోవలసిందిగా ప్రోత్స హించబడ్డారు. తద్వారా వారు విజ్ఞానవంతులయ్యారు. వారి వర్గ చైతన్యం యినుమడించింది. ప్రభుత్వ విధానాల వివరణ ద్వారా వారి రాజకీయ చైతన్యం పెంపొందించబడింది. ఇదంతా జరిగిన మీదట రైతు ప్రజానీకం స్వచ్ఛందంగానే వ్యవసాయ సంస్కరణోద్యమం లోనికి దుమికారు. భూస్వాములకు వ్యతిరేకంగా తీవ్ర ప్రత్యక్ష పోరాటాన్ని కొనసాగించారు. భూస్వాములను ప్రజాశక్తికి దాసోహమనిపించారు. వారి భూములను వ్యవసాయ పశువులను, పరికరాలను, ధాన్యాన్ని స్వాధీన పరుచుకుని వ్యవసాయకూలీలకు, బీదరైతులకు పంచిపెట్టారు. ఈవిధంగా రైతాంగం తమంతట తామే భూసంస్కరణలను అమలుజరిపారు.

పైన వివరించినట్లు రైతాంగముయొక్క యథేచ్ఛా పూర్వక సమీకరణ గావించనిదే వ్యవసాయసంస్కరణల కార్యక్రమం ప్రయోజనకరంగానూ, జయప్రదంగానూ కొనసాగలేదని గత మూడేండ్ల చైనా అనుభవం చాటుతూంది. అటువంటి సమీకరణ లేకుండా పైనుండి ప్రభుత్వ చట్టాల పైన ఆధారపడి భూస్వామ్య వర్గాలను రద్దుచేయగలమనుకోవడం గాని, భూసంస్కరణల ఫలితాలను నిలబెట్టుకోగల మనుకోడం గాని పొరపాటు.

మూడవది: పట్టణాలలోనూ, పల్లెలలోనూ కూడా విశాలమైన ఫ్యూడల్ వ్యతిరేక ఐక్యసంఘటన నిర్మించబడింది. గ్రామ జనాభాలో 90% గా ఉన్న వ్యవసాయకూలీలు, బీద రైతులు, మధ్యతరగతి రైతుల ఐక్యసంఘటనను నిర్మించడమే గాదు; కొద్దికొద్దిగా కౌలుకిచ్చే రైతులను అట్టిపెట్టడం, ధనిక

రైతాంగాన్ని తటస్థం చేయడమేగాదు; పట్టణాలలోని కార్మికులు ఉద్యోగస్థులు, విద్యార్థులూ కూడ భూసంస్కరణోద్యమాన్ని బలపరచారు. కళాశాలలకు సంబంధించిన అనేకమంది అధ్యాప కులు యీ ఉద్యమాన్ని పరిశీలించుటకు, దానిలో పాల్గొను టకు గ్రామసీమలకు పోయారు.

అంతేగాదు; ఫ్యూడల్ దోపిడీవిధానంక్రింద ప్రత్యక్షం గానో, పరోక్షంగానో బాధపడుతున్న అనేకమంది పారిశ్రా మిక, వ్యాపార పెట్టుబడిదారులుకూడా, ప్రజాప్రభుత్వం తమ పరిశ్రమలను, వర్తక వాణిజ్యాలను కాపాడేవిధానాన్ని అవలం బించడం మూలంగా, ఫ్యూడల్ వ్యతిరేక ఐక్యసంఘటనలో చేరారు. గతంనుండీ కూడా చెంగ్ కై షేక్ యొక్క అభివృద్ధి నిరోధక పరిపాలనను, సామ్రాజ్యవాద దురాక్రమణను ఎదు ర్కొంటూ, యీనాడు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానాన్ని, ప్రజాతంత్ర నియంతృత్వాన్ని బలపరచే చైతన్యంగల భూస్వా ములు కూడా కొంతమంది యీ ఉద్యమాన్ని బలపరిచారు. ఈనాటికీ వారు ప్రజాప్రభుత్వంతోనూ, ప్రజాసంస్థలతోనూ సహకరిస్తున్నారు.

ఈ విధంగా అతి విశాలమైన ఫ్యూడల్ వ్యతిరేక ఐక్యసంఘటనను నిర్మించడంద్వారా భూస్వాములను మరింత కేటాయించి భూసంస్కరణలు అత్యంత జయప్రదంగా ముగించ బడ్డాయి.

## 2. వ్యవసాయకోత్పత్తి పెరుగుదల

మొన్న మొన్నటివరకు కరువుకాటకాలకు నిత్యనిలయ మైన చైనాదేశం యీనాడు ఆహారసమృద్ధితో యెలా తుల

తూగ గలుగుతూంది ? ఒకప్పుడు బీదరికానికి, అజ్ఞానానికి ఆలవాలమైన చైనా గ్రామసీమలు యీనాడు పాడిపంటల తోనూ, నూతన వికాసంతోనూ ఎలా కళకళలాడ గలుగు తున్నాయి ?

జపాన్ వ్యతిరేకయుద్ధం ప్రారంభించిన నాటనుండీ దేశ మంతా విముక్తి చేయబడేలోపల పది సంవత్సరాల కాలంలో చైనాలో వ్యవసాయం పూర్తిగా దెబ్బతిన్నది. చైనా రైతాంగం విపరీతమైన బాధలకు గురిచేయబడింది. జపాన్ దురాక్రమణ దారులుచేసిన విధ్వంసం మూలంగానూ, చెంగ్ కై షేక్ సైనిక మూకల విచ్చలవిడి దుష్ప్రవర్తన మూలంగానూ ఉత్పత్తిసాధనాలు చాలవరకు ధ్వంసం గావించ బడ్డాయి. 1949 నాటికి పశుసంపద 16% తగ్గిపోయింది. ముఖ్యవ్యవసాయ పరికరాలు 30% వరకు నాశనం గావించ బడ్డాయి. దారుణ నిర్బంధాలకు, దోపిడీకి గురిచేయబడ్డ రైతుప్రజానీకం ఉత్పత్తి చేయుటలో ఉత్సాహాన్ని, శక్తిని గోల్పోయింది వ్యవసాయ కోత్పత్తి రాను రాను తగ్గుతూ వచ్చింది. 1949 నాటికి ఆహా రోత్పత్తి యుద్ధానికి పూర్వమున్న దానిలో 74.6% కు, ప్రత్తి ఉత్పత్తి 52% కు తగ్గిపోయాయి.

విముక్తిని సాధించిన మరుక్షణంనుండి నవచైనా ప్రభుత్వం వ్యవసాయ కోత్పత్తిని పునరుద్ధరించుటకు బ్రహ్మాండ మైన దేశవ్యాపిత ఉద్యమాన్ని ప్రారంభించింది. దేశంలోని రైతాంగాన్నంతటిని సమీకరించింది. ఆ సంవత్సరాని కాసంవ త్సరం వ్యవసాయ కోత్పత్తిని పెంచగలిగింది. ఉదాహరణకు 1949 ఉత్పత్తి పరిమాణం 100 అనుకుంటే ఆహార పదార్థాల ఉత్పత్తి 1950 లో 117 కు, 51 లో 129 కి, 52 లో 157 కు

పెంచబడింది. అలాగే ప్రత్తిఉత్పత్తి క్రమంగా 160 కి, 234 కు, 237 కు పెంచబడింది. అంటె గత మూడు సంవత్సరాలలోనూ యుద్ధానికి పూర్వంకన్న ఆహారోత్పత్తి 9%, ప్రత్తి ఉత్పత్తి 56% పెరిగాయి. అదేవిధంగా 1950 తో పోల్చినపుడు 1952 లో తేయాకు ఉత్పత్తి 2½ రెట్లు, పొగాకు 2 రెట్లు, సిల్కు 50% పెరిగాయి. పండ్ల ఉత్పత్తికూడా బాగా పెరిగింది. ఉదాహరణకు నారింజపండ్ల ఉత్పత్తి రెట్టింపయింది.

గత మూడు సంవత్సరాలలోనూ పశుసంపదకూడా గమనించదగినంతగా అభివృద్ధి అయింది. పెద్ద పశువులు 26% గొర్రెలు వగైరా 42% పెరిగాయి. పశువుల జబ్బుల నివారణకు తగిన వసతులు కల్పించుటవలన జబ్బులు చాలవరకు అరికట్టబడ్డాయి. ఉదాహరణకు 1949 లో 4 కోట్ల పశువులకు వైద్యచికిత్స చేయబడింది.

అలాగే చేపలుపట్టుట మొదలైన సముద్ర పరిశ్రమలు పునరుద్ధరింపబడి బాగా అభివృద్ధి చేయబడ్డాయి. 1949 నాటికి చేపలపరిశ్రమ యుద్ధానికి పూర్వంకన్న 30% తగ్గిపోయింది. నవచైనా ప్రభుత్వం చేపలపరిశ్రమలోని ఫ్యూడల్ విధానానికి స్వస్తిచెప్పి జాలరులకు ప్రత్యేక సహాయాలు కలిగించింది. తత్ఫలితంగా గత మూడేండ్లలోను చేపల పరిశ్రమ మూడు రెట్లు పెరిగింది.

నూతనచైనాలో మూడేండ్ల కాలంలో వ్యవసాయంలో గాని, సముద్ర పరిశ్రమలలోగాని, పశుసంపదలోగాని యింత త్వరగా తరుగును పూడ్చడమేగాక సత్వరాభివృద్ధిని సాధించడమెలా సంభవించింది? చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర ప్రజా ప్రభుత్వమూ అవలంబించిన సరియైన నాయకత్వము, విధా

నాల వలననే ఈ విజయాలు సాధించబడ్డాయని గమనించాలి. ఏమిటా విధానాలు ?

(అ) పైన వివరించిన వ్యవసాయ సంస్కరణల వలన వ్యవసాయకోత్పత్తిశక్తులు విముక్తిగావించబడ్డాయి. భూసంస్కరణల వలన 30 కోట్ల రైతాంగానికి ఆర్థికలాభం చేకూరింది. దాదాపు 11 కోట్ల 67 లక్షల ఎకరముల భూమి పంచిపెట్టబడింది. పూర్వం యీ భూమి మొత్తంమీద రైతాంగంనుండి భూస్వాములు ప్రతి సంవత్సరము 3 కోట్ల టన్నుల ధాన్యాన్ని కౌలుక్రింద వసూలుచేసేవారు. ఈనాడు రైతాంగం ఈ కౌలు భారంనుండి, భూస్వాముల బానిసత్వంనుండి విముక్తి చేయబడింది.

ఈ విధంగా తమభూమికి తామే అధినేతలైన నవచైనా రైతాంగంలో అపూర్వమైన ఉత్సాహం వెల్లివిరియడం సహజమే. విశాల రైతు ప్రజాసామాన్యం ఎనలేని పట్టుదలతో వ్యవసాయ కోత్పత్తిని, దానితోపాటు తమ జీవనస్థాయిని పెంపొందించుటకు తీవ్ర కృషి గావించారు.

(ఆ) చైర్మన్ మావో యొక్క సూచనల ప్రకారం వ్యవసాయకోత్పత్తిని పెంపొందించుట కనువైన నిర్మాణ పద్ధతులు ప్రవేశపెట్టబడ్డాయి. రైతాంగంయొక్క పరస్పర సహాయక దళాలు (Mutual aid teams) దేశమంతా నిర్మించబడ్డాయి. వ్యవసాయకోత్పత్తిదారుల సహకార సంఘాలు (Agricultural Producer's co-opratives) నిర్మించ బడుతున్నాయి. (వీటినిగురించి మరొకచోట వివరించబడింది). అలాగే సమిష్టి వ్యవసాయంలోని ప్రయోజనాలను నిరూపించి రైతులను చైతన్యవంతులను చేసేందుకుగాను ప్రభుత్వం

సంభవించింది. గత మూడు సంవత్సరాలలోను చైనా కమ్యూనిస్టుపార్టీ, కేంద్ర ప్రజాప్రభుత్వమూ ప్రజానీకాన్ని సమీకరించి పెద్దపెద్ద జలాశయాలను, ప్రాజెక్టులను నిర్మించారు. (వివరాలు తరువాత అధ్యాయంలో చదవగలరు.) అడ్డుకట్టలను మరమ్మత్తుచేశారు. ఆవిధంగా అతివృష్టి, అనావృష్టి, వరదలు మొదలైనవానినుండి కాపాడారు. నదులను అదుపులో పెట్టడమేగాక వాటిక్రింద సాగయ్యే పంటభూముల విస్తీర్ణాన్ని అదనంగా దాదాపు 3 కోట్ల 66 లక్షల ఎకరాలవరకు పెంచగలిగారు.

(బూ) గత మూడు సంవత్సరాలలోను మిడతలు, చీడపురుగులు వగైరాలను నాశనంచేసేందుకు గాను నడపిన ఉద్యమంలో 12 కోట్లమంది ప్రజలు పాల్గొన్నారు. దాదాపు 9 కోట్ల ఎకరాల భూభాగం యీ చీడపురుగుల నుండి రక్షించబడింది. తత్ఫలితంగా గతంలోవలె షుమారు 23 కోట్ల బస్తాల ధాన్యం నష్టంగాకుండ రక్షించబడింది.

(ఎ) వ్యవసాయంలో శాస్త్రీయ సాంకేతిక పద్ధతులు బహుళంగా ప్రవేశపెట్టబడ్డాయి. "ప్రజనుండి - ప్రజలకొరకు" అనే నినాదాన్ని అనుసరించి శాస్త్రీయపద్ధతులను, రైతాంగం యొక్క ఉత్పత్తి అనుభవాలను జోడించడం ద్వారా వ్యవసాయంలో కొన్ని అభివృద్ధికరమైన ప్రాథమికమార్పులు తీసుకురాబడ్డాయి. రసాయనిక యెరువులను వాడడం, విత్తనాలను జాగ్రత్తగా ఎంచడం, పంటలను పురుగులనుండి కాపాడుకోవడం మొదలైన విషయాలపై రైతాంగానికి శిక్షణ యిచ్చే నిమిత్తం పెద్దయెత్తున ఉద్యమాలు నడుపబడ్డాయి. దేశం మొత్తంమీద ఎరువుల వాడకం పూర్వంకన్న 30% పెరిగింది.

ఆహారపంటలు పండించే భూములలో 3 కోట్ల 33 లక్షల ఎకరాలమేరకు మేలురకపు విత్తనాలు ఉపయోగించబడుతున్నాయి. అలాగే ప్రత్తి పండించే భూములలో సగభాగం వరకు మేలురకపు విత్తనాలు జల్లబడుతున్నాయి. దగ్గరదగ్గరగా ఊడ్చడం, లోతుగా దున్నడం మొదలైన సోవియట్ వ్యవసాయ పద్ధతులు ప్రవేశపెట్టబడ్డాయి. భూమిని జాగ్రత్తగా సిద్ధంచేయడం, ఎరువులవాడకం, విత్తనాలను యెంచి జల్లడం లోచాలు లేక యిరచాలు వ్యవసాయం మొదలైనవ్యవసాయ పద్ధతులలో రైతాంగం చక్కని అనుభవాన్ని గడించుతున్నారు. వీటన్నింటిఫలితంగా అనేక ప్రాంతాలలో పుష్కలంగా పంటలు పండించగలుగుతున్నారు.

ఉదాహరణకు షాన్సీ రాష్ట్రంలో చూ-యో-లి అనే రైతు ఒక్కొక్క ఎకరం భూమిలో 6852 పౌనుల ప్రత్తిని పండించి కొత్త రికార్డు స్థాపించాడు. హోపీ రాష్ట్రానికిచెందిన యాంగ్ చెంగ్‌జూ అనే రైతు ప్రతి ఎకరానికి 49½ బస్తాల (246 పౌనులవి) బియ్యాన్ని పండించగలిగాడు. 1952 లోషాంటుంగ్ రాష్ట్రంలోని లైవూ వ్యవసాయ క్షేత్రంలో ఎకరానికి 6870 పౌనుల గోధుమ పండించబడింది. అదేవిధంగా సింకియాంగ్ రాష్ట్రంలో కైటూనది ఒడ్డున ప్రజాసైన్యంయొక్క ఒకదళం ఒక్కొక్క ఎకరంలో 10328 పౌనుల గోధుమ పండించగలిగారు. ఇది చైనా చరిత్రలో అపూర్వమైన రికార్డు. ఇలాంటి అధికోత్పత్తి రికార్డులు ఉదాహరణలు దేశమంతటా రైతాంగాన్ని ఉత్సాహపరచి ఉత్పత్తిని యితోధికంగా పెంచుటకు ప్రోత్సహిస్తున్నాయి.

(ఏ) వ్యవసాయకోత్పత్తిని ఎక్కువ చేసేందు దేశభక్తియుతమైన పోటీ ఉద్యమం గ్రామసీమలలో ప్రారంభించబడి క్రమానుగతంగా విస్తరించి విశాలవంతమవుతూంది. విప్లవ విద్రోహుల నణచివేయుట, అమెరికన్ దురాక్రమణను ప్రతిఘటించి కొరియాకు సహాయంచేయుట, భూసంస్కరణలు అనే యీ మూడు ప్రముఖ ఉద్యమాలలోను చైనా ప్రజానీకం సాధించిన మహత్తర విజయాలే యీ పోటీ ఉద్యమానికి ప్రోత్సాహకశక్తిగా పనిచేశాయి. చైనా రైతాంగంలో గలిగిన అపూర్వమైన ఉన్నత రాజకీయ చైతన్యస్థాయికి, శ్రమచేయుటలోగల ఉత్సాహానికి ప్రత్యక్ష నిదర్శనమే యీ పోటీ ఉద్యమం. కోట్లకొలది రైతాంగంలో ఉత్పత్తి నెక్కువచేయాలనే ఉత్సుకత కసీవినీ ఎరుగనంతగా పెల్లుబికింది. తత్ఫలితంగా చైనాలో వ్యవసాయంలోని ఉత్పత్తిశక్తులు త్వరితగతిని పురోగమిస్తున్నాయి. ఇన్నాళ్ళూ అవకాశంలేక అణగారియున్న శక్తులు క్రమంగా విజృంభిస్తున్నాయి.

## 3. నవచైనాలో వ్యవసాయక పన్ను విధానం

గతంలో చైనా రైతాంగంమధ్య కరువుదేవత ప్రతినిత్యం గజ్జెగట్టి తాండవిస్తూండేది. ప్రతి సంవత్సరం కౌలు, వడ్డీ, పన్నుల రూపంలో రైతాంగం విపరీత దోపిడీకి గురిఅవుతూవుండేది. మూలిగే నక్కపైన తాటిపండులా యివి చాలక అదనంగా అభివృద్ధి నిరోధక పరిపాలకులు రైతాంగంనుండి దాదాపు 700 రకాల లెవీలు వసూలు చేస్తూండేవారు. భూమిపై గుత్తాధికారంగల భూస్వాము లనేకమంది అసలు పన్నులే కట్టేవారు కారు. కాని ఏనాడో భూమిని పోగొట్టు

కొన్ని రైతులనుండి మాత్రం పన్నులు గుంజుతూండేవారు. కొంతమంది యుద్ధప్రభువులు రాబోయే కొన్ని సంవత్సరాలకు ముందుగానే పన్ను వసూలు చేసేవారు. 1990 వ సంవత్సరం వరకు పన్ను ముందుగానే వసూలుచేసిన ఉదాహరణలుకూడా ఉన్నాయి.

నూతన వ్యవసాయక పన్ను విధానం :—విముక్తి అనంతరం నవచైనాలో వెనువెంటనే దేశమంతటా న్యాయమైన వ్యవసాయకపన్ను విధానం ప్రవేశపెట్టబడింది. ఉత్పత్తి అభివృద్ధినీ, జాతీయ నిర్మాణాభివృద్ధినీ దృష్టిలో పెట్టుకొని పన్నుల విధానం గజిబిజి లేకుండానూ, వారి వారి తాహతుల కనుగుణ్యంగాను నిర్ణయించబడాలని "సాధారణ కార్యక్రమం" చెబుతూంది. తదనుగుణ్యంగానే వ్యవసాయకపన్ను విధించబడింది.

పన్నుల నిబంధనల ప్రకారం బంజరుభూములకు సాగులోనికి తెచ్చిన వాటిపైన 3-5 సంవత్సరాలవరకు పన్ను విధింపబడదు. అదేవిధంగా బీడుబడ్డ భూములను సాగులోనికి తెచ్చినట్లైతే 1 - 3 సంవత్సరాలవరకు పన్నురెమిషన్ యివ్వబడుతుంది.

అలాగే మోడిపోయిన భూములను స్వయంకృషిద్వారా సాగు భూములుగా మార్చిన రైతులపైన పన్నురేటు 3 - 5 సంవత్సరాలవరకు బాగా తగ్గించి వసూలు చేయబడుతుంది.

పశువుల పెంపకాన్ని అభివృద్ధి చేస్తూంటే దానిపైన ప్రస్తుతానికి పన్ను విధించబడదు.

పన్నుల నిబంధనల ప్రకారము ఆయా ప్రాంతాలలో సంవత్సరంలో భూమిపైన వచ్చే సాధారణ ఆదాయమే వ్యవ

సాయ కాదాయముగా పరిగణించ బడుతుంది. రైతు శ్రద్ధగా పనిచేయుటవలన సాధారణ ఆదాయంకన్న యెక్కువ వచ్చినట్లైతే ఆ అదనపు ఆదాయంమీద పన్ను ఉండదు. అయితే అశ్రద్ధవల్ల ఆదాయం తగ్గినపుడుమాత్రం పన్ను తగ్గించబడదు. ప్రకృతిసిద్ధమైన విపత్తులు - గాలివాన, వరద, అనావృష్టి వగైరా సంభవించినప్పుడు పన్నుతగ్గింపుతోసహా అనేక రకాలైన సహాయం అందజేయబడుతుంది.

పన్నురేట్లు :— విముక్తి అనంతరం ఒక్కొక్కరికి గల భూమి మొత్తాన్ని బట్టి విధించబడుతున్న పన్నుపద్ధతిని రద్దుచేసి వ్యవసాయిక ఆదాయాన్ని బట్టి వృద్ధి క్రమానుసారంగా 8% నుండి 40% వరకు పన్ను విధించటం జరిగింది.

కాని 1950 జూన్‌లో అమలుపరచబడిన వ్యవసాయ సంస్కరణలచట్టం అనంతరం యీ రేట్లు మార్చబడ్డాయి. కనీసరేటు 5% గాను, గరిష్ఠరేటు 30% గాను నిర్ణయించబడింది. ఈనాడు సాధారణంగా బీదరైతాంగంనుండి ఆదాయంలో 5% - 10% వరకు, మధ్యతరగతి రైతాంగంనుండి దాదాపు 15% వరకు, కొద్దిమంది ధనిక రైతులనుండి 40% వరకు పన్ను వసూలు చేయబడుతూంది.

ఆయా రైతుల కుటుంబాలలో పనిచేయగల పెద్దవారు లేనపుడు అంటే విధవ, పిల్లలు మాత్రమే ఉన్నపుడుగాని, శ్రమశక్తి కొరత ఉన్నపుడుగాని వారిపైన పన్ను వసూలు తగ్గించబడుతుంది లేదా పూర్తిగా మాని వేయబడుతుంది.

అలాగే వ్యవసాయక పద్ధతులలో యింకా వెనుకబడి యున్న అల్పసంఖ్యాక జాతులకు చెందిన రైతాంగంపై తక్కువ

పన్ను రేట్లు విధించబడుతున్నాయి. వీరికి సంబంధించిన కొన్ని ప్రాంతాలలో ప్రస్తుతాని కసలు వ్యవసాయపుపన్ను పూర్తిగా మినహాయించబడుతుంది.

ఒకే ఒక పన్ను :—1952లో వ్యవసాయంలో అదనపు పన్నులన్నీ రద్దుచేయబడ్డాయి. ఒకే ఒక పన్ను విధించబడింది. ఒక వేళ స్థానిక ప్రభుత్వశాఖలు, వైజ్ఞానిక, సాంస్కృతిక కార్యక్రమాలు, రోడ్లు, వంతెనల నిర్మాణం మొదలైన వాటికి డబ్బు వసూలుచేయదలచుకుంటే పై అధికారుల అనుమతితో వ్యవసాయకపన్నులో 7% కు మించని స్వచ్ఛంద విరాళాలు వసూలుచేయవచ్చు.

వస్తురూపంలో పన్ను :—ప్రధానంగా వ్యవసాయక పన్ను వస్తురూపంలోనే చెల్లించబడుతుంది. దాదాపు సగటున 80% వరకు ఆహారధాన్యాల రూపంలోనూ, 10% వరకు ప్రత్తి బఠానీగింజలు, తదితర వ్యాపారపంటలరూపంలోను చెల్లించబడుతుంది. పట్టణాలకు సమీపంలో నివసించే రైతులు మాత్రం తమ కిష్టమయితే ధనరూపంలో పన్ను చెల్లించవచ్చు. ఇలా ధనరూపంలో చెల్లించే పన్నులు ప్రభుత్వానికి వచ్చే మొత్తం వ్యవసాయకాదాయంలో 10% కు మించి ఉండవు.

ఈ విధంగా వస్తురూపంలో పన్ను చెల్లించడం వలన రైతాంగానికి పన్నులు చెల్లించేనిమిత్తం తమ ఉత్పత్తిని ముందుగానే అమ్ముకోవలసిన అవసరం లేకుండా పోతుంది. రెండవది ప్రభుత్వం చేతుల్లో పెద్దఎత్తున ఆహార పదార్థాల, పారిశ్రామిక ముడిసరుకుల నిల్వలుంటాయి. వీటి సరఫరాపైన కంట్రోలుంటుంది. తత్ఫలితంగా ప్రజల అవసరాలను తీర్చేం

దుకు, ధరల నడుపులో పెట్టేందుకు అవకాశం లభిస్తుంది. చైనాలో త్వరితగతిని నోట్లముద్రణాన్ని అరికట్టి ధరలను స్థిర పరచుటలో వస్తురూపేణా పన్ను విధానం ప్రముఖ పాత్రను నిర్వహించిం దనుటలో సందేహం లేదు.

ఈ నూతన వ్యవసాయక పన్ను విధానం రైతాంగాన్ని ఎంతో ఉత్సాహపరుస్తూంది. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్ను క్రింద వారికున్నదానిలో మేలిరకపు సరుకును యేరి ఎట్టి ఆలస్యము లేకుండ చెల్లించడం జరుగుతూంది. తమ బండ్లను, యెడ్లను అలంకరించుకొని, ఉల్లాసంగా పాటలు పాడుకుంటూ, నృత్యాం చేస్తూ, జండాలు రెపరెపలాడుతూండగా ప్రభుత్వ కేంద్రాలకు పోయి పన్ను చెల్లించి రావడం జరుగుతూంది. పన్నుభారం తగ్గుటతో సహజంగా రైతాంగం చొరవతో పోటీబడి యెక్కువ పంటను పండిస్తున్నారు.

## 4. వ్యవసాయంలో పరస్పర సహాయక సహకార పద్ధతులు

వ్యవసాయకోత్పత్తిని పునరుద్ధరించుటలోను, ప్రోత్సహించుటలోను రైతుల పరస్పర సహాయక దళాల, సహకార సంఘాల నిర్మాణం కూడా అత్యంత ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నాయని పైన చెప్పబడింది.

భూ సంస్కరణలద్వారా రైతాంగాని కంతటికీ భూమి లభించినప్పటికీ, శ్రమశక్తియొక్క, వ్యవసాయక పశువుల, పరికరాలయొక్క లోటును పూడ్చుకోవాలంటె రైతులు పరస్పరం సహాయం చేసుకున్నపుడే సాధ్యమవుతుంది. అదీ

గాక, వ్యవసాయ సంస్కరణల అనంతరం గ్రామీణ ఆర్థిక వ్యవస్థ మారిపోయింది. చాలామంది బీదరైతులు, వ్యవసాయ కూలీలు మధ్యతరగతి రైతుల స్థాయి నందుకున్నారు. గ్రామ సీమలలో మధ్యతరగతి రైతులే ప్రధాన వర్గంగా తయారైనారు. ఈ ఆర్థిక వ్యవస్థ నలాగే అభివృద్ధి కానిచ్చినట్లయితే వారిలో కొద్దిమంది ధనిక రైతులు గావడం, అధికభాగం తిరిగి దివాళాతీయడం, వ్యవసాయం స్తంభించడం జరుగుతుంది. ఇది జరగకుండ ఉండాలంటె ఒకే పద్ధతి ఉంది. అదే సమిష్టి వ్యవసాయ పద్ధతి. కాని చిన్న చిన్నటివరకు ఫ్యూడల్ ఉత్పత్తి విధానంలో ఉన్న రైతాంగాన్ని సమిష్టి ఉత్పత్తి విధానం లోనికి కొనిపోవాలంటె చాలా నెమ్మదిగానూ, క్రమానుగతంగానూ జరుగవలసియుంటుంది. సమిష్టి క్షేత్రాలను నెలకొల్పేముందు యితర ప్రాథమిక నిర్మాణ రూపాలు ప్రవేశ పెట్టవలసి యుంటుంది.

అందువల్లనే "సాధారణ కార్యక్రమంలో" యిలా చెప్పబడింది :

"క్రమానుగతంగా స్వచ్ఛందమైన పరస్పరం వినియోగకరమైన పద్ధతిలో, వివిధ నిర్మాణ రూపాలద్వారా, రైతాంగం పరస్పరం శ్రమసహాయం చేసుకునేందుకు, (Mutual aid in Labour) ఉత్పత్తిలో సహకరించేందుకు Co-operation in Production ప్రజాప్రభుత్వం నాయకత్వం వహించి నడుపుతుంది."

విముక్తి అనంతరం కమ్యూనిస్టుపార్టీ, ప్రజాప్రభుత్వమూ, రైతుల పరస్పరసహాయక, సహకార ఉద్యమాలకు పూర్తి మద్దతునివ్వడం జరిగింది. తత్ఫలితంగా ఈవుద్యమాలు

అతివేగంగా అభివృద్ధిచెందాయి. 1950 లో రైతాంగ కుటుంబాలలో 10% వరకు ఈ ఉద్యమాలలో చేరారు. 1951 నాటికి యీ సంఖ్య 20% కు పెరిగింది. 43 లక్షల పరస్పర సహాయక దళాలు, 400 కు పైగా వ్యవసాయకోత్పత్తిదారుల సహకార సంఘాలు నెలకొల్పబడి పనిచేస్తుండేవి. 1952 లో యివి మరింత విస్తరించాయి. పాత విముక్త ప్రాంతాలలో 65% మిగిలిన ప్రాంతాలలో 25% వరకు రైతుకుటుంబాలు చేరాయి. ఈనాడు దేశం మొత్తంమీద 4000 కు పైగా సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. వీటికితోడు యీశాన్య, వాయువ్య ఉత్తర్వైనాలలో సోవియట్టు స్వభావం గలిగిన సమిష్టి క్షేత్రాలు 10 వరకు స్ప్రాడి ఆదర్శప్రాయంగా పనిచేస్తున్నాయి.

ప్రస్తుతానికి వ్యవసాయకోత్పత్తిదారుల ఈ పరస్పర సహాయకదళాలు, సహకారసంఘాలు రైతుల వ్యక్తిగత ఉత్పత్తివిధాన ప్రాతిపదికపైన యేర్పరచబడిన మాట నిజమే. కాని వీటియొక్క లక్ష్యమేమిటి? క్రమానుగతంగా, దశల వారీగా యీ ప్రాథమిక సహకార ఉత్పత్తిపద్ధతుల నుండి రైతాంగాన్ని వారి చైతన్య స్థాయి కనుగుణ్యంగా పెద్ద యెత్తున సాగించబడే ఉత్పత్తి పద్ధతులలోనికి తీసుకుపోవడమే వీటి లక్ష్యం.

ప్రస్తుతం నవచైనా రైతాంగంలో ప్రధానంగా మూడు రకాలైన పరస్పర సహాయక, సహకార పద్ధతులు అమలులో ఉన్నాయి.

1. తాత్కాలిక పరస్పర సహాయకదళాలు :— వీటి కృషిపరిమితంగా ఉంటుంది. సాధారణంగా మూడు లేక ఐదు రైతుకుటుంబాలతో, ఒక్కొక్కప్పుడు ఎనిమిది కుటుంబా

లలో ఏర్పడతాయి. పని ముమ్మరంగా ఉన్న రోజులలో మాత్రమే పనిచేస్తాయి. ఒక్కొక్క సభ్యుడు చేసిన శ్రమ సహాయం ఉజ్జాయింపున లెక్కగట్టబడుతుంది.

చైనా రైతాంగంలో అనాదినుండి సాంప్రదాయ సిద్ధంగా పరస్పరం సహాయంచేసుకునే ఒక ప్రాథమిక అలవాటు ననుసరించే యివి నిర్మించబడ్డాయి. భూసంస్కరణల అనంతరం వ్యవసాయకోత్పత్తిని పునరుద్ధరించుటలోను, శ్రమశక్తి, వ్యవసాయక పశువుల, పరికరాలకొరతను తీర్చుటలోను యివి యెంతో సహాయపడ్డాయి. అంతేగాదు, రైతాంగంలో సమిష్టి కృషి వల్ల కలుగగల సత్ఫలితాలను రుజువుచేయుట కుపయోగపడుతున్నాయి.

2. సంవత్సరమంతా పనిచేసే పరస్పర సహాయక దళాలు :— ఇవి మొదటిరకంకన్న అభివృద్ధి కరమైనవి. సాధారణంగా ఆరు లేక ఏడు రైతు కుటుంబాలు, ఒక్కొక్కప్పుడు యిరవై కుటుంబాలవరకూ కలుస్తాయి. కొన్నిచోట్ల యిలాంటివి అనేకం ఏకమై గ్రామదళాలుగా ఏర్పడ్డాయి. ఇవి సంవత్సరం పొడుగునా శ్రమశక్తి, వ్యవసాయక పశువులు, పరికరాలు, గృహపరిశ్రమలు మొదలైన అన్నివిషయాలలోను పరస్పరం సహాయం చేసుకుంటాయి. వీటి సభ్యులు తమలో తాము పనిని విభజించుకోవడం, సమిష్టిగా పరికరాలు కొనుక్కోవడంకూడా జరుగుతుంది. దీనివలన వ్యవసాయంలో టెక్నికల్ అభివృద్ధికి అవకాశ మేర్పడుతూంది. సభ్యులొక్కొక్కరు చేసే పని యూనిట్లను సక్రమంగా అంచనా వేసుకుంటారు. వారి మధ్య విమర్శ, ఆత్మవిమర్శ అభివృద్ధి అవుతూంది. ఒక పథకం ప్రకారం ఉత్పత్తిని కొనసాగించ గలుగుతున్నారు.

ఇటువంటి దళాల నిర్మాణంద్వారా సమిష్టి వ్యవసాయం వలన కలిగే ప్రయోజనాలను గురించి రైతులు గ్రహించగలుగుతున్నారు. వీటివలన వ్యక్తిగత ఉత్పత్తిదారులలో ఉండే వెనుకబడిన తత్వమూ, మార్పు నంగీకరించని తత్వమూ క్రమానుగతంగా తొలగిపోతున్నాయి.

3. వ్యవసాయకోత్పత్తిదారుల సహకార సంఘాలు :— ఇవి మొదటి రెండు రకాలకన్న పెద్దవి. ఉన్నత స్థాయికి చెందినవి. సభ్యులు తమయొక్క భూముల నన్నింటిని కలిపి సమిష్టిగా సాగుచేస్తారు. ఆయా సభ్యులు చేసిన పనినిబట్టి, వారి వారి భూముల వాటానుబట్టి ఆదాయం పంచుకుంటారు. అంటే భూమిపై వ్యక్తిగత యాజమాన్యమే ఉంటుంది. కాని వారి వారి భూములనుమాత్రం వాటాలుగా కలిపి సాగుచేస్తారు. రైతులు తమ కిష్టంవచ్చినపుడు విడిపోయే హక్కుంటుంది. వీటిలో సాధారణంగా 10 _ 20 వరకు రైతుకుటుంబాలుంటాయి. కొన్నిచోట్ల 40_50, మరికొన్నిచోట్ల 100_200 రైతుకుటుంబాలవరకు కలసిపోయాయి. అలాగే వీరు సమిష్టిగా సాగుచేసేభూమి విస్తీర్ణంకూడా 85 ఎకరాలనుండి 500_600 ఎకరాలవరకు ఉంటుంది.

ఈ సహకార సంఘాలయొక్క ఉత్పత్తి సామర్థ్యం మిగతా రెండు పద్ధతులలోకన్న ఎక్కువని రుజువయింది. 1951 లెఖ్ఖలప్రకారం ఉత్తరచైనాలో 40 సహకార సంఘాల సగటు ఉత్పత్తి ఒక్కొక్క "మౌ" (ఎకరంలో 6 వంతు) భూమిలో పరస్పర సహాయక దళాలు ఉత్పత్తికన్న 19.6%, వ్యక్తిగత రైతు ఉత్పత్తికన్న 39.2% ఎక్కువ ఉంది.



భూస్వాములబారినుండి బయటపడ్డ రైతాంగం తమపంటనుతామే వోడ్చుకొంటున్నారు (వుడ్ కట్)

ఇటువంటి సహకార సంఘాలు చిన్నయెత్తున జరిగే వ్యక్తిగత ఉత్పత్తి విధానంనుండి సోషలిస్టు పద్ధతిలో జరిగే పెద్దయెత్తు సమిష్టి ఉత్పత్తి విధానంలోనికి పరిణామం చెందేందుకు సోపానములుగా పనిచేస్తాయనడం నిర్వివాదాంశం.

## 5. పారిశ్రామికాభివృద్ధికి దోహదం

దేశవ్యాపితంగా భూసంస్కరణలు అమలుజరిపిన పిమ్మట చైనాలో పెద్దఎత్తున ఆర్థిక నిర్మాణానికి, పారిశ్రామికాభివృద్ధికి ప్రాతిపదిక ఏర్పడింది. వ్యవసాయకోత్పత్తి పునరుద్ధరించబడటమే గాక అధికంచేయబడింది. దేశానికవసరమైన ఆహారపదార్థాల ఉత్పత్తి గ్యారంటీ చేయబడడంతో పాటు జాతీయ పరిశ్రమల కవసరమైన ముడిపదార్థాల ఉత్పత్తికూడా పెరుగజొచ్చింది. రెండవవైపున దేశ జనాభాలో అత్యధికభాగంగా ఉన్న గ్రామీణ ప్రజానీకంయొక్క కొనుగోలుశక్తి క్రమంగా ఎక్కువవుతూండడం వలన జాతీయ పరిశ్రమలలో ఉత్పత్తయిన పారిశ్రామిక వస్తువులకు స్థిరమైన దేశీయ మార్కెట్ లభ్యమై పరిశ్రమలు నిరంతరం అభివృద్ధి చెందుటకు అవకాశాలేర్పడ్డాయి.

## 6. కళకళలాడే గ్రామసీమలు

వ్యవసాయ సంస్కరణలు, వ్యవసాయకోత్పత్తిలో ప్రవేశపెట్టబడిన నూతన నిర్మాణపద్ధతులు, గ్రామీణప్రాంతాలలో గొప్ప ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ప్రయోజనాలను సాధించగలిగాయి. గ్రామసీమల స్వరూపమే మారిపోతూంది.

జీవనస్థాయి పెరుగుదల :—ఫ్యూడల్ దోపిడినుండి విముక్తిగావడంవలననూ, వ్యవసాయకోత్పత్తి పెరగడంవలననూ సహజంగా చైనా రైతాంగంయొక్క జీవిత పరిస్థితులు చాలా అభివృద్ధిచెందాయి. అనేక ప్రాంతాలలో వ్యవసాయసంస్కరణాలకు పూర్వం మొత్తం గ్రామీణ జనాభాలో మధ్యతరగతి రైతాంగం 20% గానూ, వ్యవసాయకూలీలు, బీదరైతాంగము 70% గానూ ఉండేవారు. కాని యీనాడు మధ్యతరగతి రైతాంగం 80% గానూ, బీదరైతులు, వ్యవసాయ కూలీలు 20% గానూ ఉంటున్నారు.

రైతాంగంయొక్క కొనుగోలుశక్తి బాగా పెరిగింది. 1951 వ సంవత్సరములోనే దేశం మొత్తంమీద ప్రజల కొనుగోలు శక్తి 1950 లో కన్న 25% పెరిగింది. 1950 లో కన్న 1951 లో బట్టల అమ్మకం 10%, సిగరెట్లు 14%, అగ్గిపెట్టెలు 20%, పంచదార 44%, కిరోసిన్ 47%, టీ 70% పెరిగాయంటే రైతాంగం యొక్క కొనుగోలుశక్తి ఎంత పెరిగిందో అర్థం చేసుకోగలుగుతాము.

రాజకీయ చైతన్యాభివృద్ధి:—భూసంస్కరణలఫలితంగా రైతాంగంయొక్క రాజకీయ చైతన్యం యినుమడించింది. వారు ఛైర్మన్ మావోను, కమ్యూనిస్టుపార్టీని, ప్రజా ప్రభుత్వాన్ని మరింత గాఢంగా ప్రేమిస్తున్నారు. రైతు ప్రజానీకం యీనాడు గ్రామసీమలలోని ప్రజాపరిపాలనకు ఆధారభూతంగా తయారయ్యారు. ఆ విధంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర నియంతృత్వమూ, కార్మిక కర్షక సహచరత్వమూ సుస్థిరం గావింపబడ్డాయి.

భూ సంస్కరణల పోరాటంలో కాకలు తీరిన గ్రామీణ యువతీయువకు లనేకమంది రాజకీయ సాంఘిక జీవితంలో ఉత్సాహంగా ముందుకు వస్తున్నారు. 1951 లో ఒక్క తూర్పు చైనాలోనే 3,00,000 మంది రైతు యువతీయువకులు చైనా నూతన ప్రజాస్వామిక యువజనసమితిలో సభ్యులుగా చేరారు. అలాగే తూర్పు, మధ్య-దక్షిణ (Central South) నైరుతి, వాయువ్య చైనాలలో 8.8 కోట్లకుపైగా రైతుసంఘ సభ్యులు చేరారు. (వీటిలో స్త్రీలు 30% వరకున్నారు.) గ్రామసీమలలో యీనాడు రైతుసంఘాలు అత్యంత గౌరవంగా చూడబడడమే గాక నిజమైన రాజకీయ అధికారాన్ని కలిగియున్నాయని చెప్పవచ్చు. రైతులు భూస్వాములను నిరాయుధులనుచేసి తామే ఆయుధాలను ధరించారు. శ్రమద్వారా జీవించడం నేర్చుకొని తమనుతాము సంస్కరించుకొన నిరాకరిస్తున్న తలబిరుసు భూస్వాములను జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నారు. భూసంస్కరణల కాలంలో నెలకొల్పబడిన రైతు ప్రతినిధుల సమావేశాల పునాదిపైన గ్రామసీమలలో ప్రజాప్రభుత్వాంగాలుగా ప్రజాప్రతినిధి సమావేశాలను ఏర్పరచి, బలపరచి, స్థిరీకరించుటవలన గ్రామీణ ప్రాంతాలలో రైతులే అధిపతులయ్యారని చెప్పవచ్చు. తత్ఫలితంగా గ్రామీణ ప్రాంతాలలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర నియంతృత్వం సుస్థిరం గావింపబడడమేగాక దేశమంతా ప్రజాస్వామికం గావడానికి దోహదమివ్వబడింది.

సంస్కృతీవికాసం :— రైతాంగంయొక్క భౌతిక రాజకీయ జీవితంలో వచ్చిన మార్పులవలననూ, నిర్మాణంలో

చేసే శాశ్వత ప్రజాపాఠశాలలు నెలకొల్పబడ్డాయి. శీతాకాలపు స్కూళ్ళకు హాజరయ్యే వయస్సు మీరిన రైతులసంఖ్య ఆ సంవత్సరాని కాసంవత్సరం పెరుగుతూంది. నిజానికి అనేక శీతాకాలపు పాఠశాలలు, రైతులకు తీరుబడికాలంలో పనిచేసే శాశ్వత పాఠశాలలుగా మార్చి వేయబడుతున్నాయి. సాహిత్య పాఠాలు బోధించడం, పత్రికాపఠనా కేంద్రాలు, నల్లబల్ల పత్రికలు నడపడం మామూలు గ్రామాలలో కూడా నిత్య కృత్యంగా జరుగుతూంది. తమ సంస్కృతీస్థాయిని పెంపొందించు కోవాలనే రైతాంగంయొక్క ఉత్సుకత నాధారం చేసుకుని దేశవ్యాపితంగా పెద్ద యెత్తున 'చి చిన్ హు' యొక్క తేలిక బోధనాపద్ధతి ననుసరించి చదువు నేర్పేందుకు శీతాకాలపు పాఠశాలలు నిర్మించుటకు ఏర్పాట్లు జరిగాయి. ఈవిధంగా రైతాంగంలో నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు తీవ్ర కృషి జరుగుతూంది.

# 2

# ప్రాజక్టుల నిర్మాణము

నదీప్రాజక్టుల నిర్మాణంలోను, వ్యవసాయక ప్రాజక్టుల నిర్మాణములోను, నీటివసతుల నభివృద్ధి పరచుటలోను, నీటి పారుదల సౌకర్యాలను హెచ్చుచేయుటలోను, చైనాప్రజానీకం గత మూడేండ్లలోను బ్రహ్మాండమైన విజయాలను సాధించారు. అభివృద్ధి నిరోధక కొమిన్‌టాంగు పరిపాలనలో అశ్రద్ధ చేయబడిన అనేక నిర్మాణ కార్యక్రమాలను అతి చురుకుగా పూర్తిచేయగల్గారు. వేలాది సంవత్సరాలనుండి మాటిమాటికి ముప్పును తెచ్చిపెడుతున్న వినాశకరమైన వరదల ప్రమాదాన్ని చాలవరకు తొలగించి వేయడం జరిగింది. చైనాలో అధిక భాగంలో వ్యవసాయము నిరంతరాయంగా కొనసాగుటకు, ప్రజలు నిరపాయంగా జీవించుటకు గ్యారంటీ యేర్పడింది.

1949 వ సంవత్సరములో 1 కోటి 67 లక్షల ఎకరాల భూమికిపైగా వరదలకు గురిఅయింది. 1950 లో కోటి ఎకరాలభూమి, 1951 లో 35 లక్షల ఎకరాలభూమి, 1952 లో

26 లక్షల ఎకరాల భూమిమాత్రమే వరదప్రమాదానికి గురి అయింది. ఈ విధంగా ఆ సంవత్సరాని కా సంవత్సరం వరద ప్రమాదం త్వరితగతిని తగ్గించివేయ బడుతూంది.

గత మూడేండ్లలోను నదుల నీరు వృధాగాకుండ, సక్రమంగా వినియోగించుటలో కూడ గొప్ప విజయాలు సాధించ బడ్డాయి. 1952 జూన్ నాటికి 1949 తో పోలిస్తే ఒక్క ఉత్తర చైనాలోనే నీటిపారుదల సౌకర్యంగల సాగు భూమి రెండు రెట్లు పెరిగింది. వర్షాధారమే దాదాపు లేని వాయువ్య చైనాలో 1949 లో ముగ్గురికి 33 సెంట్లు చొప్పున నీటి సౌకర్యం గల సాగు భూమి వుంటే ఈనాడు సగటున ఒక్కొక్క రైతుకు 17 సెంట్లు సాగుభూమిఉంది. దేశంమొత్తంమీద నీటిసౌకర్యం గల భూమి ఈనాడు అదనంగా 82 లక్షల, 50 వేల ఎకరాలు యెక్కువయింది. అదేవిధంగా పూర్వం మాటిమాటికి అనావృష్టికి గురి ఔతున్న దాదాపు 3 కోట్ల ఎకరాల భూమికి ఈనాడు నీటి సౌకర్యం యెక్కువచేయబడింది.

1951 నుండి స్థానికంగా ఎక్కడికక్కడ నదులను ఖాయిదాలో ఉంచే కార్యక్రమంనుండి మొత్తంనదుల గమనాన్నే ఖాయిదాలో నుంచే కార్యక్రమానికి పూనుకోవడం జరిగింది. కేవలం నదులనుండి వచ్చే ప్రమాదాన్ని అరికట్టే కార్యక్రమమేగాక ప్రజల సౌభాగ్యానికి తోడ్పడే విధంగా నదీప్రవాహాల నుపయోగించే దశకు, వరదలనష్టాన్ని అరికట్టడమే గాక వరదనీటిని ఉపయోగించుకొనే దశకు పురోగమించడం జరిగింది. అనేక జలాశయాల నిర్మాణంద్వారా నీరు నిల్వ చేయబడి పలువిధాల ఉపయోగించబడుతుంది. సాగుభూములకు నీరు సరఫరాచేయుటతో పాటు అనేక

విద్యుచ్ఛక్తి కేంద్రాల నిర్మాణము కొనసాగుతూంది. దేశ మంతటా నౌకాయానము అభివృద్ధి చేయబడుతూంది.

అనేక నదులను గలిగి, దేశమంతటా వర్షపాతము ఒకే రకంగా లేని చైనాలాంటి పెద్దదేశంలో ఇంత తక్కువకాలంలో ఇన్ని గొప్పమార్పులు తీసుకురావడం తేలిక విషయంగాదు. గత మూడేండ్లలోను ఈ కార్యక్రమములో దాదాపు 2 కోట్ల ప్రజలు పాల్గొన్నారు. షుమారు 170 కోట్ల ఘనపుటడుగుల మట్టిపని చేశారు. అంటే 10 పనామా కాలువలు లేక 23 సూయజ్ కాలువలు త్రవ్వినంతపని చేశారన్నమాట.

## 1. నదీప్రాజక్టుల నిర్మాణము

1949–'52 సంవత్సరాలమధ్య చైనాలోనున్న 42 వేల కిలోమీటర్ల పొడవుగల అడ్డుకట్టలను చాలా భాగంవరకు మరమ్మతు చేయడంగాని, దిట్టపరచడంగాని జరిగింది. పల్లదనంగా ప్రవహిస్తున్న తూర్పుచైనాలోని హ్వాయే, యీ, షూ నదులను, ఉత్తరచైనాలో నియంగ్‌టింగ్, టాచింగ్, చోపే నదులను అదుపులో పెట్టేందుకు చురుకుగా కృషిసాగుతూంది. యాంగ్‌ట్సీ యెల్లో నదుల లోయలలో కలుగుతున్న వినాశకరమైన ముంపుల నరికట్టేందుకు తాత్కాలికమైనప్పటికి ప్రయోజనకరమైన చర్యలు తీసుకోబడ్డాయి. ఈ పెద్దనదుల నదుపులోపెట్టుటకు చాలకాలం తీసుకుంటుందిగాబట్టి యీ తాత్కాలిక చర్యలు మాత్రమే తీసుకో బడ్డాయి.

హ్వాయేనదీ ప్రాజక్టు :— ఈ నదిపైన నిర్మించబడుతున్న బ్రహ్మాండమైన ప్రాజక్టులకు ఛైర్మన్ మావోయే



హ్వాయ్‌యేనదిపై ఆనకట్టను నిర్మించుట — యెన్ హాన్ చే కొయ్యపైచెక్కబడ్డ బొమ్మ (వుడ్ కట్)

స్వయంగా ప్రణాళికను సూచించాడు. 2,20,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంగలిగి 6 కోట్లు జనాభాగలిగిన హ్యూయే నదీలోయను వరదలనుండి శాశ్వతంగా రక్షించడం, నదీనీటిని దాదాపు 83½ లక్షల ఎకరాలభూమిని సాగుచేయుటకు వినియోగించడం, 2 వేల మీటర్ల పొడవున నౌకాయానానికి సౌకర్యం గలిగించడం, అనువైన ప్రదేశాలన్నింటిలో జల విద్యుత్ కేంద్రాలను నెలకొల్పడం, ఈ ప్రాజక్టులయొక్క లక్ష్యాలు. ప్లాన్ ప్రకారం దీనిని 5 ఏండ్లలో పూర్తిచేయవలసి ఉంది.

నిర్మాణము 1950 శీతాకాలములో ప్రారంభించబడి నప్పటికి 1952 సెప్టెంబర్ నాటికే ఈ క్రింది కార్యక్రమం పూర్తిగావించబడింది. 13 జలాశయాలలోను 3 నిర్మింపబడ్డాయి. 17 వరద నిరోధక ప్రాజక్టులకుగాను 13 పూర్తి అయ్యాయి. వీటన్నింటిలో మొత్తం 1000 కోట్ల ఘనపు మీటర్ల నీరు నిల్వచేయవచ్చు. నదిపొడుగునా దాని ఉపనదుల పొడుగునా 2 వేల 120 కిలోమీటర్ల అడ్డుకట్టలు మరమ్మతు చేయబడ్డాయి. 2 వేల 880 కిలోమీటర్ల పొడవుగల కాలువలు త్రవ్వి లోతుచేయబడ్డాయి. 20 పిల్లకాలువలు త్రవ్వబడ్డాయి. 170 కిలోమీటర్ల పొడవుగల ప్రధానమైన ఉత్తర కియాంగ్‌సూ పంటకాలువ, ముఖ్యమైన స్లూయిన్‌గేట్లు పూర్తి చేయబడ్డాయి. పై పనితోపాటు దానికి సంబంధించిన 138 కల్వర్టులుకూడ కట్టబడ్డాయి.

వీటివలన హ్యూయే లోయలోని ప్రజలు తరచువచ్చే వరదల ప్రమాదంనుండి రక్షించబడ్డారు. ఎంత బ్రహ్మాండమైన వరదలు వచ్చినా ఎట్టిప్రమాదం రాకుండ ఈ లోయలోని

ప్రధానభాగాలు కాపాడబడ్డాయి. ఈప్రాజక్టు 1955 వ సంవత్సరానికి తప్పనిసరిగా పూర్తిచేయబడుతుంది.

చైనాప్రజలకు "ఎల్లో" నదివలన కలిగేవిపత్తు ప్రపంచ ప్రఖ్యాతిగాంచినదే. గత 2500 సంవత్సరాల రికార్డును పరిశీలిస్తే యీ నదియొక్క అడ్డుకట్టలు ప్రతి పదిసంవత్సరాలలోను సగటున నాలుగుసార్లయినా తెగిపోయి ఉంటాయి. 1947 లోనే యీ నదియొక్క చివరిభాగంలో విశాలమైన ప్రాంతంవిముక్తి చేయబడింది. ఆనాటినుండి అచటి ప్రజల సమిష్టికృషివలన అనేక సార్లు పెద్దపెద్ద వరదలముప్పు అరికట్టబడింది. ప్రజలు 8 కోట్ల 20 లక్షల ఘనపు మీటర్ల మట్టిపని, 17 లక్షల ఘనపు మీటర్ల తాపీపని చేశారు.

1951 లో పెద్దపెద్ద వరదలను నివారించేందుకు, శీతాకాలంలో మంచుగడ్డల ప్రమాదం తొలగించేందుకు, పీ చింటీ, ఎల్లో నదుల మధ్య ఒక వరదనివారక మడుగును, పాంటంగ్ రాష్ట్రంలోని లిట్సిన్ జిల్లాలో ఒక స్పిల్ వే (Spill way) ను నిర్మించడం జరిగింది.

'యాంగ్‌ట్సీ'నది 'ఎల్లో'నదంత ప్రమాదకరం గాకపోయినా పదిసంవత్సరాల కొకసారైనా దీనినుండికూడా వరద ప్రమాదముంది. దీనినుండి వచ్చే వరద ప్రమాదాన్నరికట్టేందుకు గాను గత మూండేడ్లలోను 21 కోటి 70 లక్షల ఘనపు మీటర్ల మట్టిపని చేయబడింది. నది పొడుగునా ఉన్న అడ్డుకట్టలు పూర్తిగా మరమ్మతు చేయబడ్డాయి. చింకియాంగ్ ప్రాంతంలో ఒక వరద డైవర్షన్ ప్రాజెక్టు (వరదనీటిని ప్రక్కకు మళ్ళించేప్రాజక్టు) 1952 లోనే పూర్తి చేయబడింది. దీనికిగాను 114 కిలో మీటర్ల పొడవుగల అడ్డుకట్టను బలంగా నిర్మించా

డము, 921 చదరపు కిలోమీటర్ల వరదనీటిని భరించే మడుగును నిర్మించడం, షుమారు 1054 మీటర్ల పొడవుగల స్లూయిస్ గేటును, 336 మీటర్ల పొడవుగల రెగ్యులేటరును నిర్మించడం పూర్తయింది. ఈవిధంగా "యాంగ్‌ట్సీ" నది కిరువైపుల నివసించే ప్రజానీకానికి వరద ప్రమాదాలనుండి శాశ్వత రక్షణ చేకూర్చబడింది.

ఇదేవిధంగా తూర్పు చైనాలోని 'ఈ', 'షూ' నదుల లోయలలో తరచు వచ్చే వరదవిపత్తు నిరోధించబడింది. ఉత్తరకియాంగ్సూ, షాంటుంగ్ రాష్ట్రాలకు చెందిన ప్రజలు "ఈ"నది వరదనీటిని భరించేందుకు 180 కిలోమీటర్ల వైశాల్యం గల ఒక సరస్సును, అలాగే "షూ" నదికి 69 కిలోమీటర్ల వైశాల్యముగల సరస్సును నిర్మించుకున్నారు. ఈ సరస్సులకు నేరుగా సముద్రంతో సంబంధమేర్పరచారు. వీటికి సంబంధించిన ఉపనదులను, కాలువలను అన్నింటిని మరమ్మతు చేశారు. గ్రాండ్ కెనాల్ అనే కాలువకు రెండు అదనపు లాకులుగట్టి ఆ కాలువను నౌకాయానానికి వీలుగా తయారు చేయడమేగాక పంటచేలకు సమృద్ధిగా నీటిని సరఫరాచేయ గలుగుతున్నారు. మొత్తం యీ రెండునదుల మధ్యగల భూభాగంలో గతంలో వరదలకు గురియౌతున్న 26 లక్షల ఎకరాల భూమికి రక్షణ గల్పించబడింది.

ఇంకా వివరాలలోనికి వెళ్ళితే చాలా వ్రాయవలసి వస్తుంది. పైన చెప్పినట్లుగానే హ్వాయ్, ఛోపే, యంగ్‌టింగ్, టూచింగ్, పెరల్, హాన్ మొదలైన అనేక నదులపైన ఇలాంటివే చిన్నవి పెద్దవి అనేక కార్యక్రమములు పూర్తి చేయబడ్డాయి. ఇంకా కొన్ని నిర్మాణంలో ఉన్నాయి.

# 2. ఇతర వరదనిరోధక చర్యలు

పైనచెప్పిన నిర్మాణ కార్యక్రమాలతో పాటు చైనా ప్రజానీకమంతా వరదల విపత్తు నరికట్టేందుకుగాను ఎంతో చురుకుగాను, సమిష్టిగాను ఇంకా యెన్నోరకాలైన జాగ్రత్తలు తీసుకున్నారు.

చైనాలో అనేక నదులలో వరదలు రావడానికి ప్రధాన కారణం నదీప్రవాహాలలో కొట్టుకువచ్చిన మట్టి నదుల చివరి భాగాలలో పేరుకుపోయి మెరక వేయడమే. తత్ఫలితంగా ఆ భాగాలలోని కట్టలు ప్రవాహ వేగానికి తట్టుకోలేక రాను రాను బలహీనపడి తెగిపోతాయి. వరదనీటి ప్రవాహంవలన పంటభూములు ఒండ్రు వేయడం జరుగుతుంది. దీని నరికట్టేందుకుగాను అడవుల పెంపకమూ, గడ్డి పెంచడమూ, వ్యవసాయక పద్ధతులలో మార్పు తీసుకురావడమూ, ఒండ్రు నాపేందుకు ఆనకట్టలు నిర్మించడమూ, భూమిని మెట్లుమెట్లుగా తయారుచేయడమూ అవసరము.

ప్రజాప్రభుత్వ మేర్పడిన కొద్దికాలానికే స్థానిక ప్రజా ప్రభుత్వ శాఖల నాయకత్వంక్రింద సమీకరించబడిన లక్షలాది రైతాంగం ఎంతో చురుకుగా అన్ని నదులమీద కూడా వేల కొలది వరదమట్టిని నిరోధించే ఆనకట్టలను మరమ్మతుచేయడం గాని, క్రొత్తవి నిర్మించడంగాని చేశారు. అటవీశాఖవారి సహాయంతో పర్వతప్రాంతాలలో అడవులను పెంచే కార్యక్రమం చురుకుగా సాగుతూంది.

అలాగే గత మూడేండ్ల లోనూ సాధారణంగా వరదలు వచ్చే ప్రాంతాలలో స్థానిక ప్రభుత్వ నాయకుల సహాయంతో వరద నిరోధక కేంద్రాలు తెరువబడ్డాయి. వీటిలోనికి వేలాది ప్రజలు అడ్డుకట్టలను సరిచూచేందుకూ, యితర వరదనిరోధక కార్యక్రమాన్ని కొనసాగించేందుకు సమీకరించబడ్డారు. వీటితోపాటు పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటుల సహాయంతో వరదవచ్చే సూచనలను గమనించి ప్రజలను హెచ్చరించేందుకుగాను దేశవ్యాపితంగా అనేక సంస్థలు నెలకొల్పబడ్డాయి. ఈవిధంగా వరదల సీజన్‌లో మెలకువగా ఉండి కట్టలు తెగిపోకుండా కాపాడేందుకుగాను అనేక ప్రజాసంస్థలు నిర్మింపబడి ప్రభుత్వ సహాయంతో పని చేస్తున్నాయి.

## 3. వ్యవసాయక ప్రాజక్టుల సత్వరాభివృద్ధి

గత మూడేండ్ల లోను దేశమంతటా 358 వ్యవసాయక ప్రాజక్టులు నవీనపద్ధతుల ననుసరించి నిర్మింపబడ్డాయి. వీటి వలన అనావృష్టిబాధ చాలవరకు నివారించబడింది. ఎల్లోనది నీటిని ఒక పెద్ద కాలువద్వారా 'వీ' నదిలోనికి తీసుకుపోయే ప్రాజక్టు పూర్తయింది. (ఈకాలువనే ప్రజా విజయపు కాలువ అంటారు.) దీనిద్వారా ప్రస్తుతం 80 వేల ఎకరాల భూమి సాగవుతూంది. కొద్దికాలంలోనే దాదాపు 1 లక్ష, 67 వేల ఎకరాలభూమి సాగుకాగలదు. దీనివలన మరో ప్రయోజనం కూడా సాధించబడింది. మామూలుగా తక్కువ లోతు కలిగిన 'వీ' నది ప్రవాహం యెక్కువ గావడంవలన 900 కిలో మీటర్ల పొడవున సంవత్సరమంతా నౌకాయానానికి వీలుకలిగింది.

ఈశాన్య చైనాలో టంగ్‌లియోహాలో, పాన్‌షాన్, చహాయాంగ్, కియోషిన్, చీ మొదలైనవాటికి సంబంధించిన యిరిగేషన్ సౌకర్యాల నభివృద్ధిచేయుటద్వారా ప్రస్తుతం లక్ష ఎకరాల సాగుభూమికి నీరు సరఫరా చేయబడుతూంది. త్వరలోనే వీటి నింకా అభివృద్ధి చేయుటద్వారా 6 లక్షల 66 వేల ఎకరాల భూమికి నీరు యివ్వబడుతుంది. సుయుయాంగ్ రాష్ట్రంలోని హుయాంగ్‌సీ, యాంగ్‌చియా, యూలా కాలువల మరమ్మతు జరుగుతూంది. వీటివలన దాదాపు 1 లక్ష 67 వేల ఎకరాల భూమి సాగు కాగలదు. చహార్ రాష్ట్రంలోని సాంగ్‌కాన్, హున్, యూ నదుల నీటివనరుల నభివృద్ధి చేయుటద్వారా ప్రస్తుతం 50 వేల ఎకరాల భూమికి నీరు సప్లయి చేయబడుతూంది. త్వరలోనే ఈ సాగుభూమి 1 లక్ష 63 వేల ఎకరాలకు పెంచబడుతుంది. షాన్సీ రాష్ట్రంలో నిర్మించిన వ్యవసాయక ప్రాజెక్టులద్వారా లక్ష ఎకరాల భూమికిపైగా సాగుచేయబడుతూంది. షెన్సీరాష్ట్రంలో చింగ్, వీ, లో, హాన్, పో కాలువల మరమ్మతుద్వారా షుమారు 83 వేల ఎకరాల భూమికిపైగా అదనంగా సాగులోనికి తీసుకురాబడింది.

వీటితోపాటు స్థానిక ప్రభుత్వశాఖల సహాయంతో రైతాంగం గుంటలుత్రవ్వడం, జలాశయాలు నిర్మించడం, చెరువులు త్రవ్వడంద్వారా అనేక చిన్నచిన్న వ్యవసాయక ప్రాజక్టులు నిర్మింపబడ్డాయి. ఇలాంటి ప్రాజక్టులు దాదాపు 33,60,000 వరకు నిర్మించబడినట్లు రికార్డులు తెలియజేస్తున్నాయి. వీటిఫలితంగా కొన్ని కొత్తప్రాంతాలలో భూమి అదనంగా సాగులోనికి తీసుకురాబడింది. కొన్ని సాగుభూము

లకు నీటిసరఫరా యెక్కువచేయబడింది. ఈ విధంగా అనావృష్టి భయం అంతరింప జేయబడింది.

6,68,000 నూతులను మరమ్మతు చేయడంగాని, క్రొత్తగా త్రవ్వడంగాని జరిగింది. ప్రభుత్వం భూగర్భంలోని నీటిని పూర్తిగా వినియోగించుకునేందుకుగాను రైతాంగానికి 2,93,000 నీటిచక్రాలు సప్లయిచేసింది. వ్యవసాయాన్ని అభివృద్ధిచేసేందుకు పల్లపుభూములలో నిల్వఉన్న నీటిని బయటకు పంపేందుకుగాను 1,17,500 హార్స్ పవర్ గల్గిన వ్యవసాయక యంత్రాలను మరమ్మతుచేసి యివ్వడంగాని, కొత్తగా తయారు చేసి యివ్వడంగాని చేసింది.

మొత్తంమీద నీటిని జాగ్రత్తగాను, పొదుపుగను వినియోగించుకోవడంలో సోవియట్ అనుభవాన్ని అనుసరించుటవలనకూడ వ్యవసాయాన్ని విస్తృతం చేయుటకెంతో తోడ్పడింది.

# 4. సత్వరాభివృద్ధికి కారణాలు

కొద్దికాలంలోనే ప్రాజక్టుల నిర్మాణంలో యింత ఆశ్చర్యకరమైన అపూర్వ విజయాన్ని సాధించుటకు కారణమేమిటి?

మొదటిది:—చైర్మన్ మావో, చైనాకమ్యూనిస్టు పార్టీలిస్తున్న ఉత్సాహమూ, నాయకత్వాలే యిందుకు ప్రధాన కారణం. నూతన ప్రజాస్వామిక విధానంయొక్క విశిష్టత, యీ నూతన రాజకీయ విధానంనుండి ఉత్పన్నమైన నూతన అభిప్రాయాల ప్రాబల్యం, శ్రమయెడల నూతన దృక్పథం, ఉత్పత్తిలో అవలంబించబడిన నూతన సాంకేతిక విధానం - ఇవన్నీ యీ విజయాలను సులభసాధ్యం చేశాయి.

# 2

# ప్రాజక్టుల నిర్మాణము

నదీప్రాజక్టుల నిర్మాణంలోను, వ్యవసాయక ప్రాజక్టుల నిర్మాణములోను, నీటివసరుల నభివృద్ధి పరచుటలోను, నీటి పారుదల సౌకర్యాలను హెచ్చుచేయుటలోను, చైనాప్రజానీకం గత మూడేండ్లలోను బ్రహ్మాండమైన విజయాలను సాధించారు. అభివృద్ధి నిరోధక కొమిన్‌టాంగు పరిపాలనలో అశ్రద్ధ చేయబడిన అనేక నిర్మాణ కార్యక్రమాలను అతి చురుకుగా పూర్తిచేయగల్గారు. వేలాది సంవత్సరాలనుండి మాటిమాటికి ముప్పును తెచ్చిపెడుతున్న వినాశకరమైన వరదల ప్రమాదాన్ని చాలవరకు తొలగించి వేయడం జరిగింది. చైనాలో అధిక భాగంలో వ్యవసాయము నిరంతరాయంగా కొనసాగుటకు, ప్రజలు నిరపాయంగా జీవించుటకు గ్యారంటీ యేర్పడింది.

1949 వ సంవత్సరములో 1 కోటి 67 లక్షల ఎకరాల భూమికిపైగా వరదలకు గురిఅయింది. 1950 లో కోటి ఎకరాలభూమి, 1951 లో 35 లక్షల ఎకరాలభూమి, 1952 లో

# 3

# పారిశ్రామికాభివృద్ధి

సామ్రాజ్యవాదుల దురాక్రమణ మూలంగానూ, ఫ్యూడల్ వ్యవస్థ ఫలితంగానూ గత నూరేండ్లు, అంతకుముందు నుండీకూడా చైనా పారిశ్రామికంగా వెనుకబడిన దేశంగానే ఉండిపోయింది. 1937 లో జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధం ప్రారంభమయ్యేనాటికి నవీనపరిశ్రమలలో ఉత్పత్తయ్యే వస్తువుల విలువ మొత్తం ఉత్పత్తి విలువలో 10 వ వంతు మాత్రమే. ఆనాడున్న కొద్దిపాటిపరిశ్రమలుకూడా సామ్రాజ్యవాదులయొక్క, కుమింటాంగ్‌కు సంబంధించిన నిరంకుశ పెట్టుబడిదారులయొక్క గుత్త యాజమాన్యంక్రింద నడుస్తూండేవి. చిన్నచిన్న బలహీనమైన జాతీయ పరిశ్రమలు అభివృద్ధికాకుండ అణచివేయబడ్డాయి. తత్ఫలితంగా చైనాదేశం దీర్ఘకాలంగా సామ్రాజ్యవాదుల సరుకులకు పెద్ద మార్కెట్‌గాను, వారి దురాక్రమణ కొరకు లక్ష్యంగాను తయారయింది.

గత పదేండ్లకుపైగా జరిగిన యుద్ధకాలంలో ఫ్యాక్టరీలు, గనులు తీవ్రనష్టానికి గురి అయ్యాయి. అభివృద్ధినిరోధక కుమింటాంగ్ సైనికదళాలు పారిపోయేటప్పుడు ముఖ్యమైన పరిశ్రమలను కొన్నింటిని పూర్తిగా ధ్వంసంచేసిపోయారు. తత్ఫలితంగా 1949 నాటికి పారిశ్రామిక వస్తూత్పత్తి బాగా తగ్గిపోయింది. బొగ్గు ఉత్పత్తి 50% పైనా, ఉక్కు, యినుముల ఉత్పత్తి 80% పైనా, బట్టల ఉత్పత్తి 25% కు పైనా తగ్గిపోయాయి. మొత్తంమీద పారిశ్రామికోత్పత్తి సగటున 50% తగ్గిపోయింది.

చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క నాయకత్వాన, సుదీర్ఘ పోరాటంద్వారా చైనా ప్రజానీకం అభివృద్ధి నిరోధక కుమింటాంగ్ పరిపాలనకు స్వస్తిచెప్పి, దురాక్రమణ తత్వంతో కూడుకున్న సామ్రాజ్యవాద శక్తులను చైనా భూభాగంనుండి తరిమివేసి, ఐక్య, ప్రజాతంత్ర, సర్వస్వతంత్ర నూతనచైనాను నిర్మించుకున్నదే తడవుగా అనుపమ సాహసోత్సాహాలతో తమదేశ ఆర్థిక పునరుద్ధరణకు నడుంకట్టారు.

## 1. పరిశ్రమలలో సంస్కరణలు

1950 మార్చినుండి కేంద్రప్రజాప్రభుత్వం దేశవ్యాపితంగా ఆదాయవ్యయాలను కేంద్రఅధికారం క్రిందికి తీసుకొనివచ్చుటను, సరుకులధరలను, కరెన్సీని స్థిరీకరించుటకు తీవ్రమైన కృషిని ప్రారంభించి సత్వరవిజయాన్ని సాధించినట్లు తర్వాత అధ్యాయంలో చూస్తాము. తత్ఫలితంగా దేశమంతటా ప్రభుత్వ పరిశ్రమలలోగాని, ప్రయివేటు పరిశ్రమలలోగాని ఉత్పత్తిని పునరుద్ధరించి అభివృద్ధి చేయుటకు ప్రాతిపదిక ఏర్పడింది. బడ్జట్

లోటును పూడ్చుకుని ఆదాయవ్యయాలను సరిపుచ్చుటవలన క్రమేణా ప్రభుత్వయాజమాన్యానడిచే పరిశ్రమలలోను, గనుల పరిశ్రమలలోను ప్రభుత్వం ఎక్కువ మొత్తాలను పెట్టుబడి పెట్టుటకు వీలుకల్గింది. ప్రభుత్వపరిశ్రమలలో ఖచ్చితంగా వ్యాపార లెఖ్ఖలు (Business Accounting) తయారుచేయడానికి, ఉత్పత్తి పథకాలను నిర్ణయించడానికి, తదితర సంస్కరణలను ప్రవేశ పెట్టడానికి అనువైన పరిస్థితు లేర్పడ్డాయి. అదేసమయంలో ప్రయివేట్ పరిశ్రమలు స్పెక్యులేటర్ల మార్కెట్‌తో నిమిత్తం లేకుండ ఉత్పత్తిని క్రమబద్ధంగా కొనసాగించుటకు, ప్రజాజీవితానికి, దేశంయొక్క ఆర్థికాభ్యుదయానికి అనుగుణ్యమైన విధంగా ఉత్పత్తి చేయుటకు వీలుచిక్కింది.

అభివృద్ధినిరోధక కుమింటాంగ్ ప్రభుత్వంనుండి, యుద్ధ నేరస్థులనుండి, దేశద్రోహులనుండి స్వాధీనపరచుకున్న పరిశ్రమలను, గనులను పునరుద్ధరించి అభివృద్ధిచేయాలన్నా, అవినీతి పూరితమైన పారిశ్రామిక మేనేజిమెంటును పూర్తిగా పునర్నిర్మించి వాటిలో ప్రజాతంత్ర సంస్కరణలు ప్రవేశపెట్టాలన్నా, వాటిలో పనిచేసే కార్మిక ప్రజాసామాన్యంపైన ఆధారపడిన నాడే సాధ్యపడుతుంది. నవచైనా ప్రభుత్వం వెంటనే ఈపనికి పూనుకుంది. కార్మికవర్గ దోపిడీయే ప్రధానలక్ష్యంగాగల మేనేజిమెంట్ విధానంలోని ప్రధాన అవలక్షణాలను రూపుమాపింది. ఫాక్టరీలలోను, గనులలోను దాక్కొనియున్న విప్లవ ప్రతిఘాతకులను ఏరిపారవేసింది. కార్మికుల నణగగొట్టుతున్న ఫ్యూడల్ నిరంకుశాధికారుల కోరలు ఊడబెరికింది. చాలాకాలంనుండి అనుభవం గడించిన పాత సాంకేతిక నిపుణు

లను సమీకరించి చైతన్యవంతులనుచేసి ప్రజలకు విధేయులై పనిచేసేటట్లు మార్చింది.

ఈ ప్రజాతంత్ర సంస్కరణలను ప్రవేశపెట్టిన కొద్ది కాలంలోనే ఉత్పత్తిపద్ధతులను సంస్కరించేందుకు ప్రాపతిపదిక ఏర్పడింది. పారిశ్రామిక మేనేజిమెంట్‌లోని అరాజకత్వానికి స్వస్తి చెప్పబడింది. సహేతుకమైన కూలీవిధానమూ, ఉత్పత్తిలో బాధ్యతావిధానమూ ప్రవేశపెట్టబడ్డాయి. ఆయా పరిశ్రమ లలో ఉత్పత్తి పథకాలు తయారుచేయబడడమేకాక సాంకేతిక ప్రమాణాలు నెలకొల్పబడ్డాయి. పరిశ్రమలలో క్రమబద్ధంగా వ్యాపార లెక్కలు నిక్కచ్చిగా తయారుచేసే విధానాన్ని ప్రవేశ పెట్టేందుకు పునాదిగా ఉత్పత్తి ఖర్చులను ఖచ్చితంగా లెక్క గట్టే పద్ధతి అవలంబించబడింది. వీటితోపాటు దేశవ్యాపితంగా కార్మికులయొక్క చొరవతో ఉత్పత్తి నెక్కువచేసే ఉద్యమం ప్రారంభించబడింది.

పైన చెప్పిన విజయాలు సాధించాక ఆ పునాదిపైన దేశభక్తిపూరిత అధికోత్పత్తి ఉద్యమమూ, పొదుపుద్వారా ఉత్పత్తి ఖర్చులు తగ్గించే ఉద్యమమూ ప్రారంభించబడ్డాయి. ఈ ఉద్యమాలు పారిశ్రామిక మేనేజిమెంటును అభివృద్ధి పరచుటకూ, కార్మికవర్గంయొక్క సృజనాత్మకశక్తినీ, శ్రమలో ఉత్సాహాన్ని మరింత పెంపొందించుటకు తోడ్పడ్డాయి. ఒక్క 1951 లోనే 23,80,000 మంది కార్మికులు ఉత్పత్తిలో దేశ భక్తిపూరిత పోటీ ఉద్యమంలో పాల్గొన్నారు. 1952 మొదటి అర్ధభాగంలో ఉద్యమంలో కార్మికులు, ఇతర ఉద్యోగస్థులు 80% వరకు పాల్గొన్నారు. కార్మికవర్గం చొరవతో ఉత్పత్తిలో అనేక రకాలైన రేషనలైజేషన్ పద్ధతులను సూచించారు.

తద్వారా సోషలిస్టు స్వభావంగల్గిన ప్రభుత్వ ఆర్థిక విధానం యొక్క విశిష్టత ఋజువైంది.

పై ఉద్యమాలతోపాటు వివిధ పరిశ్రమలలోని ఉత్పత్తి కోటాల ప్రమాణాలు హెచ్చుచేయబడుతూ వచ్చాయి. మొట్టమొదట గతంలో సాధించబడిన ఉత్పత్తి రికార్డులనే ప్రమాణాలుగా నిర్ణయించడం జరిగింది. కాని కార్మిక ప్రజానీకంయొక్క ఉత్సాహమూ, సృజనాత్మకశక్తి పెంపొందడం వలన వారి ఉత్పత్తి సామర్థ్యం పెరిగి త్వరలోనే యీరికార్డులు అధిగమించబడ్డాయి. గత మూడేండ్లలోను పాత ఉత్పత్తి రికార్డులు ఎంతో వెనుకబడిపోయాయి. ఉదాహరణకు 1949 తో పోలిస్తే 1952 లో విద్యుచ్ఛక్తి ప్రసారక సాధనాలను నెలకొల్పే నిపుణత 82% పెరిగింది. ప్రభుత్వంచే నిర్వహింపబడే బొగ్గు గనులలో ఒక్కొక్క కార్మికునియొక్క సగటు దినసరి ఉత్పత్తి రేటు 0.33 టన్నులనుండి 0.62 టన్నులకు పెరిగింది. చైనాలోని బ్లాస్ట్ ఫర్నేసులలో పనిచేసే కార్మికుల నిపుణత దాదాపు సోవియటు కార్మికుల నిపుణతకు దగ్గరగా చేరుతుంది. యంత్ర నిర్మాణ పరిశ్రమలలో హెచ్చు వేగమూ, మల్టి-టూర్ కటింగ్ పద్ధతులలో నిపుణతసాధించటం వలన వివిధ రకాలైన లేత్ యంత్రాలపైన పనిచేసే నిపుణత 4-5 రెట్లు పెరిగింది. అదేవిధంగా 1949 తో పోలిస్తే 1952 లో ఒక్కొక్క కదురుయొక్క ఉత్పత్తి రేటు 15%, ఒక్కొక్క మగ్గంయొక్క ఉత్పత్తి రేటు 26% పెరిగాయి. సన్ననూలు పనిచేసే ఒక కార్మికుడు 250 కదుళ్ళకుబదులు యీనాడు 800 కదుళ్ళపై పనిచేస్తున్నాడు. ఒక్కొక్క కార్మికుడు పూర్వమువలె 4 సాధారణ మగ్గాలనుగాక 24 మగ్గాలను

నడుపుతున్నాడు. అలాగే 10 ఆటోమాటిక్ మగ్గాలకు బదులు 32 నడుపుతున్నాడు.

పూర్వం చైనాలో యెప్పుడూ ఉత్పత్తి చేయబడని అనేక కొత్త వస్తువులు యీనాడు తయారు చేయబడు తున్నాయి. ఇనుపపట్టాలు, వివిధ రకాలైన లేత్ యంత్రాలు, గని పరిశ్రమల యంత్రాలు, పెద్ద పెద్ద స్లూయిస్ గేట్లు, మగ్గాలు వగైరా చైనాలోనే తయారు చేయబడుతున్నాయి. వివిధ పరిశ్రమలలో పైనచెప్పిన విజయాలన్నిటి ఫలితంగా ఉత్పత్తిరేటు త్వరితగతిని పెరగడమేగాక క్రమానుగతంగా ఉత్పత్తి ఖర్చులు కూడ తగ్గుతూవచ్చాయి.

ఉత్పత్తి ఉద్యమంలో అనేకమంది కార్మికవీరులు ఉద్భ వించారు. వివిధ ఉత్పత్తి శాఖలలో కొత్తకొత్త ఉత్పత్తి రికార్డులు, కొత్తకొత్త పద్ధతులు, సాంకేతిక విధానాలు ప్రవేశ పెట్టబడుతూనే ఉన్నాయి. చావ్‌కూ-యూ, పాన్‌చాంగ్-యూ, మాహెంగ్-చాంగ్, మాలూ-హై, సూచాంగ్-యూ, హాచన్-సియూ మొదలైన కార్మికవీరుల పేర్లు చైనా అంతటా ప్రఖ్యాతి గాంచాయి. వీరుసూచించిన నూతన సాంకేతిక పద్ధతులూ, పనిచేసే విధానంలో మార్పులూ దేశానికి కొన్ని కోట్ల యువాన్‌ల (చైనానాణాలు) సంపదను మిగిల్చేందుకు తోడ్పడడమేగాక ఆయాపరిశ్రమలలో సత్వరాభివృద్ధికి, ఉత్పత్తి రేటును పెంచుటకు సహాయపడ్డాయి.

ప్రయివేట్ పరిశ్రమలలో :— పరిస్థితికూడా త్వరలోనే అభివృద్ధిచేయబడింది. సాధారణ కార్యక్రమంలోని 30 వ ఆర్టికల్ ఈ క్రిందివిధంగా చెబుతూంది. "జాతీయక్షేమానికి, ప్రజాజీవితానికి ఉపయోగపడే ప్రయివేట్ ఆర్థికసంస్థలన్నీ చురుకుగా

పనిచేసేందుకు ప్రజాప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. వాటి అభివృద్ధికి తోడ్పడుతుంది."

తదనుగుణ్యంగానే ప్రభుత్వసంస్థలన్నీ ప్రయివేట్ పరిశ్రమలకు ప్రోత్సాహాన్నిస్తున్నాయి. ప్రభుత్వ పరిశ్రమలకు కావలసిన ముడిపదార్థాలను శుభ్రపరచి యిచ్చేందుకు యితర వస్తుభాగాల నుత్పత్తి చేసి యిచ్చేందుకు ప్రయివేట్ పరిశ్రమలతో కంట్రాక్టులు చేసుకుంటాయి. అలాగే ప్రభుత్వం ప్రజావసరాలైన కొన్ని సరుకుల ఉత్పత్తికి ఆర్డర్లుయిస్తుంది. రెండవ వైపున వాటికవసరమైన ముడిపదార్థాలను సప్లయిచేయడమూ, వాటిలో ఉత్పత్తయిన సరుకులకు మార్కెట్ చూపించడముద్వారా వాటిని ప్రోత్సహిస్తూంది. తత్ఫలితంగా ప్రభుత్వపథకాల కనుగుణ్యంగా ప్రయివేట్ పెట్టుబడిదారులు తమ పరిశ్రమలలో ఉత్పత్తిని నిరంతరాయంగా కొనసాగించగలుగుతున్నారు. వాటిలో పనిచేసే కార్మికులు, "కార్మికులకు, పెట్టుబడి దారులకు యిద్దరకు ప్రయోజనకరమైన విధానం" అనే సూత్రాన్ననుసరించి పెట్టుబడిదారులతో నూతనసంబంధాల నేర్పరచుకొన్నారు. సరిసమానతా సిద్ధాంతంపైన పెట్టుబడిదారుల కార్మికుల ప్రతినిధులతోగూడిన సలహాసంఘాలు నిర్మించబడ్డాయి. ఈ నూతన సంబంధాల ఫలితంగా ప్రయివేట్ పరిశ్రమలలోకూడా శ్రమచేయుటలో కార్మికవర్గం ఉత్సాహాన్ని కనబరుస్తూంది. వారి ఉత్పత్తిశక్తి పెరుగుతూంది. రెండవవైపున ఉత్పత్తి పెరుగుటవల్ల పెట్టుబడిదారుల ప్రయోజనాలుకూడా రక్షింపబడుతున్నాయి.

# 2. పారిశ్రామికోత్పత్తి పెరుగుదల

గత మూడేండ్లలో కమ్యూనిస్టుపార్టీయొక్క, ఛైర్మన్ మావోయొక్క సక్రమ నాయకత్వం, కార్మికవర్గంయొక్క చొరవ, ఉత్సాహం, సృజనాత్మకశక్తి, వివిధ ప్రభుత్వ శాఖల కృషి, కార్మికులకు పెట్టుబడిదారులకు మధ్య, ప్రభుత్వ పరిశ్రమలకు ప్రయివేట్ పరిశ్రమలకు మధ్య నెలకొల్పబడిన నూతన సత్సంబంధాలు – వీటన్నింటి ఫలితంగా దేశమంతటా ఫాక్టరీల లోనూ, గనులలోనూ విముక్తికి పూర్వమెన్నడూ లేనంతగా ఉత్పత్తి పెరిగింది. గత మూడేండ్లలోను ప్రధాన పారిశ్రామికోత్పత్తి పునరుద్ధరణను, పెరుగుదలను తెలిపే అంకెలు యీ క్రింద యివ్వబడ్డాయి.

| | విముక్తికిపూర్వం గరిష్ట ఉత్పత్తి | 1949 ఉత్పత్తి | 1952 ప్లాను ప్రకారం ఉత్పత్తి కావలసింది. |
|---|---|---|---|
| విద్యుచ్ఛక్తి | 100 | 72 | 115 |
| బొగ్గు | 100 | 45 | 90 |
| పెట్రోలియం | 100 | 38 | 136 |
| ముడియినుము | 100 | 11 | 104 |
| ఉక్కుకడ్డీలు | 100 | 16 | 155 |
| ఉక్కు | 100 | 18 | 167 |
| సిమెంటు | 100 | 31 | 148 |
| ప్రత్తినూలు | 100 | 72 | 144 |
| బట్టలు | 100 | 73 | 161 |
| కాగితం | 100 | 90 | 234 |
| సిగరెట్లు | 100 | 83 | 145 |
| అగ్గిపెట్టెలు | 100 | 85 | 111 |
| పిండి | 100 | 78 | 106 |







1952 లో పథకం ప్రకారం యీ కోటాలు దాదాపుపూర్తి చేయబడ్డాయి. కొన్ని పరిశ్రమలలో అధిగమించబడ్డాయికూడా.

పై అంకెలనుబట్టి చైనాలో అతిప్రధానమైన నవీన పరిశ్రమలు త్వరితగతిని అభివృద్ధి అవుతున్నాయని స్పష్టమవుతుంది. ప్రభుత్వంచే నిర్వహింపబడే పరిశ్రమలు విశిష్టమైన సోషలిస్టు స్వభావాన్ని కలిగియుండుటవలన "జాతీయాభివృద్ధి యొక్క సమపరిమాణాభివృద్ధి సూత్రా"న్ననుసరించి (స్టాలిన్ సామ్యవాద ఆర్థిక సమస్యలు) భారీపరిశ్రమలు, తేలిక పరిశ్రమలుకూడా సక్రమనిష్పత్తిలో అభివృద్ధి కాగలుగుతాయనుటలో సందేహంలేదు.

పరిశ్రమల నిర్మాణంలో ప్రాథమికమైన మార్పు తీసుకురాబడింది. భారీ పరిశ్రమలు, ముఖ్యంగా ఉక్కు, యినుము, యంత్రోత్పత్తి పరిశ్రమలు తేలిక పరిశ్రమలకన్న ఎక్కువ రేటున అభివద్ధిచేయబడ్డాయి. వివిధరకాలైన యంత్రాల ఉత్పత్తిలోను, యంత్రభాగాల ఉత్పత్తిలోను స్వయం సమృద్ధి రానురాను ఎక్కువవుతూంది. మొత్తం పారిశ్రామికోత్పత్తిలో భారీపరిశ్రమల ఉత్పత్తికి, తేలికపరిశ్రమల ఉత్పత్తికి మధ్యగల నిష్పత్తికూడా మారింది. 1949 లో మొత్తం ఉత్పత్తిలో భారీపరిశ్రమలకు, తేలిక పరిశ్రమలకు మధ్యగల నిష్పత్తి **32.5% : 67.5%** ఉంటే, **1952** నాటికది **43.8% : 56.2%**గా మారింది.

# 3. అధికతరాభివృద్ధికి కృషి

పారిశ్రామికరంగంలో సాధించిన ఈ అభివృద్ధిని యింకా ముందుకు తీసుకుపోవాలంటే మూడు ప్రాథమిక విషయాలను ముందు సాధించవలసియుంటుంది. నవీన యంత్రాలను వినియో

గించడం, ఆ యంత్రాలపై పనిచేయగల సాంకేతిక నిపుణులను తయారుచేసుకోవడం, ఆర్థికాభివృద్ధి కవసరమైన పెట్టుబడిని సేకరించడం.

(1) నవీనయంత్ర వినియోగం :— సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ ప్రజాస్వామికాలయొక్క సహాయంతో చైనాలోని పెద్దపెద్ద నవీన పరిశ్రమలన్నిటిలోను మొదటితరగతికిచెందిన నవీనయంత్రాలు అమర్చబడుతున్నాయి. చైనాలో యీనాడు నిర్మాణప్రాజెక్టులలో బలమైన డ్రాగ్‌లైన్సు, బుల్‌డోజర్లు, తదితర త్రవ్వయంత్రాలు, నిర్మాణయంత్రాలు వినియోగించబడుతున్నాయి. అలాగే విద్యుచ్ఛక్తి పరిశ్రమలో పెద్దపెద్ద టర్బైన్లు, జనరేటర్లు; రోలింగ్‌మిల్లులు; శక్తివంతమైన బ్లాస్ట్, ఉక్కు ఫర్నేసులు; అధునాతన యంత్రభాగాలు; శాస్త్రీయమైన భూగర్భపరిశోధన పరికరాలు; నవీన రవాణాయంత్రాలు; ట్రాక్టర్లు, కోతయంత్రాలు, తదితర అధునాతన వ్యవసాయక పరికరాలు వాడబడుతున్నాయి. కాలంగడచినకొద్దీ యింకా ఎక్కువగా వినయోగించబడుతాయనుట నిస్సందేహం.

(2) సాంకేతిక నిపుణులశిక్షణ :— విముక్తియనంతరం కార్మికవర్గంయొక్క సృజనాత్మకశక్తి, చొరవ ఎలా అభివృద్ధి అయ్యాయో, దేశభక్తిపూరిత అధికోత్పత్తి ఉద్యమంలోనూ, పోటీ ఉద్యమంలోనూ, పొదుపు వుద్యమంలోనూ కార్మికవర్గం యెలా నాయకత్వంవహించి నవచైనాయొక్క చోదకశక్తిగా పనిచేస్తుందో పైననే వివరించడం జరిగింది.

వాటితోపాటు నవచైనా కార్మికవర్గం ఆయా పరిశ్రమల ఉత్పత్తిపథకాలను తయారుచేయుటలోనూ, ఆయా పరిశ్రమ

లలో యింతవరకు ఉపయోగింపబడని రిజర్వులను బయట పెట్టుటలోనూ, ఉత్పత్తికోటాలను నిర్ణీతకాలంకన్న ముందుగానే పూర్తిచేయుటలోనూ, ఉత్సాహంగా పాల్గోవడంద్వారా వారి సృజనాత్మక శక్తికి మరింత ప్రోత్సాహం లభిస్తూంది.

సోవియట్ పని పద్ధతులు, ఉత్పత్తి నిర్మాణంలో సోవియట్ అనుభవము విరివిగా వినియోగించబడుతున్నాయి. సోవియట్ అనుభవాన్ని కూస్తో కాస్తో వినియోగించని పారిశ్రామిక శాఖలు చైనాలో లేవనేచెప్పవచ్చు. "మనం పట్టుదలతో సోవియట్‌యూనియన్‌నుండి నేర్చుకోవాలి. మార్క్సు ఏంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల సిద్ధాంతాలనేగాదు, సోవియట్ యూనియన్ యొక్క అభివృద్ధియైన శాస్త్రాన్ని, సాంకేతిక విధానాలనూ కూడా నేర్చుకోవాలి." అని ఛైర్మన్ మావో యిచ్చిన సలహాను చైనాప్రజలు అమితోత్సాహంతో ఆచరిస్తున్నారు. సోవియట్ అనుభవాల నధ్యయనంచేసి ఆచరిస్తున్న అగ్రగామి కార్మికులసంఖ్య చైనాలో రానురాను పెరుగుతూంది. తత్ఫలితంగా క్రమానుగతంగా చైనా కార్మిక వర్గంయొక్క సాంకేతిక నిపుణత అభివృద్ధి చేయబడుతూంది.

సాంకేతిక నిపుణత సాధించిన అగ్రగామి కార్మికులలో నుండి పరిశ్రమల నిర్వహణ కవసరమైన నిపుణులను తయారు చేసుకోవడం జరుగుతూంది. చైనా కార్మికవర్గం యీనాటికే వేలకొలది పార్టీ, ప్రభుత్వ, పారిశ్రామిక సంస్థల నిర్వహణా బాధ్యతలను స్వీకరించగల నిపుణులను తయారుచేసి యివ్వగలిగింది. వారిలో 7800 మంది ఫ్యాక్టరీ మేనేజర్లు, అసిస్టెంటు మేనేజర్లుగా పనిచేస్తున్నారు. గత మూడేండ్లలోను కార్మిక వర్గంలోనుండి అభివృద్ధియై ముందుకువచ్చిన 20,000 మందికి

యీనాడు ప్రత్యేక పాఠశాలల్లో శిక్షణ యివ్వబడుతూంది. త్వరలోనే వీరంతా యింజనీర్లుగానూ, సాంకేతిక నిపుణులుగానూ, ఫ్యాక్టరీ మేనేజర్లుగానూ బాధ్యతలను స్వీకరిస్తారు.

పరిశ్రమ లభివృద్ధి చెందుతున్నకొలది వేలాదియింజనీర్లు, సాంకేతిక నిపుణులు, లక్షలాది నిపుణులైన కార్మికులు అవసరమవుతారు. వీరిని తయారుచేసుకునే నిమిత్తం కేంద్ర ప్రజా ప్రభుత్వం మధ్యరకపు, ఉన్నత సాంకేతిక పాఠశాలల సంఖ్యను రానురాను పెంచుతూంది. నూనె పరిశ్రమ యింజనీర్లను తయారు చేసేందుకు సియాన్, టీన్‌ట్సీన్‌లలో రెండు ప్రత్యేక కళాశాలలు నెలకొల్పబడ్డాయి. పీకింగ్‌లో మరో కళాశాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. 1952 లో ఉన్నతవిద్యాలయాల్లో శిక్షణపొందే విద్యార్థుల సంఖ్య 2,20,000 వరకు ఉన్నది. వీరిసంఖ్య 1949 తో పోలిస్తే 69% పెరిగింది. వీరిలో 90,000 మందివరకు సాంకేతిక కళాశాలల్లో చదువుతున్నారు. మధ్యరకపు సాంకేతిక నిపుణులకు త్వరత్వరగా శిక్షణ యివ్వబడుతూంది. ఒక్క ఈశాన్యచైనాలోనే 37 సాంకేతిక పాఠశాలలు నడుపబడుతున్నాయి. వాటిలో 29,000 మంది విద్యార్థులు - 1949 కన్న 9 రెట్లు - అభ్యసిస్తున్నారు.

వీటితోపాటు కార్మిక నిపుణులకు పెద్దపెద్దమిల్లులలోను, ఫ్యాక్టరీలలోనూ ప్రత్యక్షంగా తరిఫీదు యివ్వబడుతూంది. పరిశ్రమల పునరుద్ధరణా దశలోనే అనేకమందికి శిక్షణ పూర్తి చేయబడింది. ఒక్క అన్‌షాన్ ఉక్కు కర్మాగారాలలో 30 వేలమంది నిపుణులను అయిదు సంవత్సరాలలో తయారు చేయుటకు పథకం వేయబడింది. ఈశాన్యచైనాలో యిప్పటికే 3 లక్షలమందికి శిక్షణ యివ్వబడింది. వీరిలో 2,44,000 మంది

బిల్డింగ్ కార్మికు లున్నారు. ఇదేవిధంగా దేశమంతటా పెద్ద యెత్తున నిపుణులకు శిక్షణ యివ్వబడుతూంది.

(3) ఆర్థికాభివృద్ధి కవసరమైన పెట్టుబడి సేకరణ :—
(అ) నవచైనా తనయొక్క బ్రహ్మాండమైన అభివృద్ధిప్రణాళికలను అమలు పరచాలంటె ఎంతో పెట్టుబడి అవసరం. ఇంత పెట్టుబడి నెక్కడనుండి సంపాదించగలుగుతుంది ?

ముఖ్యంగా ప్రభుత్వం నిర్వహించే పరిశ్రమలనుండి, తదితర ప్రభుత్వ ఆర్థిక రంగాలనుండి యీ పెట్టుబడి సేకరించబడుతూంది. ప్రభుత్వ ఆర్థిక రంగాలలో ఉత్పత్తి పద్ధతుల నభివృద్ధిచేయుటవలన, శ్రమయొక్క ఉత్పత్తిశక్తి పెరుగుట వలన, ప్రభుత్వ నిధులను పొదుపుగా వాడడంవలన ప్రభుత్వానికి హెచ్చు ఆదాయం వస్తూంది. 1952 నాటికే ప్రభుత్వ యాజమాన్యాన నడిచే ఆర్థికరంగంనుండి మొత్తం జాతీయ బడ్జట్‌లో 60% వరకు ఆదాయం వచ్చింది. వ్యవసాయపు పన్నుద్వారానూ, ప్రయివేట్ పరిశ్రమలపై పన్నుద్వారాను వచ్చే ఆదాయంకూడా రానురాను పెరుగుతూంది.

వీటితోపాటు పెద్దపెద్ద ప్రాజక్టుల నిర్మాణంలో కార్మికుల జాగ్రత్తవలన, పరిశ్రమలలో యిన్నాళ్లూ నిరుపయోగంగా ఉన్న రిజర్వుశక్తులను వినియోగించుటవలన, ఉత్పత్తిశక్తి పెరగడంవలన, సాధారణంగా పొదుపు ఉద్యమం వలన పథకం ప్రకారం వేసుకున్న బడ్జట్ అంచనాలకన్నా చాలాతక్కువ ఖర్చవుతూంది. ఈ విధంగా మిగిలిననిధి అంతా ఆర్థికాభివృద్ధికి వినియోగించ బడుతూంది.

ఉదాహరణకు 1952 లో సాగించిన పొదుపు ఉద్యమం వలన 30 లక్షల కోట్ల యుయాన్‌లు మిగిలాయి. అలాగే జాతీయపరిశ్రమలలో అంచనాలకన్న 22 లక్షల కోట్ల యుయాన్‌లు తక్కువఖర్చయింది. ఈ విధంగా సమకూరిన ధనమంతా పెట్టుబడికి వినియోగించ బడుతూంది. 1952 లో జాతీయార్థిక రంగంలో 73 కోటి కోట్లయుయాన్‌లు ఖర్చుపెడితే 1953 లో 103 కోటికోట్లు ఖర్చుపెట్టుటకు నిర్ణయించబడింది. దీనిలో దాదాపు సగంమొత్తం ప్రధాన పరిశ్రమల అభివృద్ధికి వినియోగించ బడుతుంది.

(ఆ) సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక దేశాల ఆర్థిక సహాయం.

పునరుద్ధరణాదశలోవలెనే, నేడూ యికముందుకూడా చైనా ప్రజానీకం సోవియట్ యూనియన్, తూర్పుయూరప్ ప్రజాస్వామికాలయొక్క మిత్రత్వాన్ని పరస్పర సహకారాన్ని సర్వతోముఖ సహాయాన్ని పొందుతూనే ఉంటారు. సోవియట్ యూనియన్ చేసే సహాయం చాలా చౌకగాను, ప్రయోజనకరంగాను, నిపుణాత్మకంగాను ఉంటుంది. ఒకరికొకరు తోడ్పడుకుంటూ, అందరియొక్క ఆర్థికాభ్యుదయానికి పాటుబడాలనే మనఃపూర్వకమైన వాంఛ మినహా యీ సహాయానికి ఎట్టి షరతులూ లేవు. ఈసహాయం పూర్తిగా నిస్స్వార్థమైనది.

సోవియట్-చైనా ప్రభుత్వాల మధ్య జరిగిన మిత్రత్వ, పరస్పరసహకార సంధియొక్క మూడవ వార్షికోత్సవ సందర్భంలో మావో-సే-టుంగ్ యిలా చెప్పారు.

"సోవియట్ ప్రభుత్వము, సోవియట్ ప్రజలు నవచైనాకు చేసిన స్వార్థరహితమైన, హృదయపూర్వకమైన సహాయం

చైనాయొక్క ఆర్థికపునరుద్ధరణకు, అభివృద్ధికి తోడ్పడడమేగాక చైనాయొక్క పంచవర్ష ప్రణాళిక నమలుపరచి పెద్దయెత్తున జాతీయాభివృద్ధిని సాధించుటకు దోహదమివ్వగలదు."

1953 మార్చిలో సోవియట్ - చైనాలు చేసుకున్న మరొక ఒడంబడిక ప్రకారం 1953 లో రెండుదేశాలమధ్య జరుగవలసిన వ్యాపారాన్ని గురించి, సోవియట్ యిచ్చే అప్పులను గురించి, చైనాలోని విద్యుచ్ఛక్తి కేంద్రాల అభివృద్ధికి సోవియట్ సహాయాన్ని గురించి నిర్ణీతంగా వ్రాసుకోవడం జరిగింది. ఈ ఒడంబడిక ప్రకారం సోవియట్ యూనియన్ చైనాకు లోహ, ఖనిజ, యంత్రనిర్మాణ, రసాయనిక, విద్యుచ్ఛక్తి వగైరా పరిశ్రమలకు అవసరమైన యంత్రసామగ్రిని, అలాగే నవీన వ్యవసాయకయంత్రాలను, మేలురకపు పశువులను, విత్తనాలను సప్లైచేయాలని నిర్ణయించబడింది.

సోవియట్‌దేశం వలెనే తూర్పుయూరప్ ప్రజాస్వామికాలు - జకోస్లావికియా, పోలెండ్, హంగరీదేశాలు కూడా పారిశ్రామికవస్తుసహాయం చేస్తున్నాయి. చైనా ఈ దేశాలతో వస్తుమారకపు ఒడంబడికలు కుదుర్చుకుంది.

చైనాకు సోవియట్ చేసే సహాయం యింతమాత్రమే గాదు. మరో గొప్ప సహాయంకూడ చేస్తూంది. అనేకమంది సాంకేతిక నిపుణులను పంపుతూంది. ఈ నిపుణులు చైనాయొక్క ఆర్థికాభివృద్ధి పథక నిర్మాణంలో సలహాలు యివ్వడమేగాక, పరిశ్రమలను నెలకొల్పడంలో ప్రత్యక్ష సహాయం చేస్తున్నారు. చైనా కార్మికులకు అధునాతన సోవియట్ సాంకేతిక యంత్రాలను నడపడంలో శిక్షణ యిచ్చిన అభివృద్ధిమైన

సోవియట్ సాంకేతిక విధానాలలో నిపుణత సాధించేందుకు సహాయపడుతున్నారు.

## 4. 1953 పథకం

చైనాను శక్తివంతమైన పారిశ్రామిక దేశంగా తయారు చేయుటకు ప్రాతిపదికగా మొదటి పంచవర్ష ప్రణాళిక తయారు చేయబడింది. ఈ ప్రణాళికలో ఏ సంవత్సరాని కా సంవత్సరం ప్రత్యేక కోటాలు నిర్ణయించబడి అమలు జరుపబడుతున్నాయి. 1953 పథకాన్ని పరిశీలిస్తే చైనాయొక్క పారిశ్రామికాభివృద్ధి వేగాన్ని అర్థంచేసుకోగలుగుతాము.

ఈ సంవత్సరంలో పెట్టుబడినిర్మాణ పరిమాణం (Volume of capital construction) 1952 లో కన్న 41% ఎక్కువ చేయబడుతుంది. భారీపరిశ్రమలు, యంత్ర నిర్మాణ పరిశ్రమ 47%, బొగ్గు, నూనె వగైరా పరిశ్రమలు 86% ఎక్కువ నిర్మించబడతాయి. దేశవ్యాపితంగా అనేక అభివృద్ధి ప్రాజక్టులు పెద్దయెత్తున నిర్మించబడతాయి. ఒక్క ఈశాన్య చైనాలోనే 30-35 లక్షల చదరపు మీటర్ల వైశాల్యం గలిగిన యంత్రాగారాలు, గృహవసతుల నిర్మాణం ప్రారంభించబడింది. ఇచట 98 పెద్ద పెద్ద పరిశ్రమలు నిర్మింపబడుతున్నాయి. అదేవిధంగా వాయువ్య చైనాలో 1952 లో కన్న 6 రెట్లు ఎక్కువనిర్మాణం జరుగుతూంది. ఒకేసారి 170 పెద్ద పెద్ద పరిశ్రమల నిర్మాణం ప్రారంభించబడింది.

ఈ సంవత్సరంలో భారీపరిశ్రమలకు - యంత్రనిర్మాణ లోహ, రసాయనక పరిశ్రమలకు ప్రాధాన్యత యివ్వబడు

తుంది. 13 భారీపరిశ్రమలను పునర్నిర్మించి విస్తృతపరచాలని మధ్యచైనాలో ఒక పెద్ద ఉక్కు కర్మాగారంతో పాటు 8 కొత్తవి నిర్మించాలని పథకం వేయబడింది. అలాగే 15 యంత్రనిర్మాణ కర్మాగారాలను విస్తృత పరచాలని 9 కొత్తవి నిర్మించాలని తీర్మానించబడింది. వీటిలో భారీయంత్ర నిర్మాణం, విద్యుచ్ఛక్తి పరికరాల ఉత్పత్తి, ఆటోమొబైల్ పరిశ్రమ, నౌకా నిర్మాణ పరిశ్రమ కూడా ఉంటాయి.

అదేవిధంగా మూడు జలవిద్యుత్ స్టేషన్‌లు, పన్నెండు థర్మల్ విద్యుత్ స్టేషన్‌లు విస్తృతం చేయబడతాయి. తొమ్మిది థర్మల్ విద్యుత్ స్టేషన్లు కొత్తగా కట్టబడతాయి. 1952 లో కన్న విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి యీ సంవత్సరం అయిదురెట్లు ఎక్కువ ఖర్చుపెట్ట బడుతుంది.

పారిశ్రామికోత్పత్తి కవసరమైన బొగ్గునూనె, తదితర ముడిపదార్థాల ఉత్పత్తి నెక్కువ చేసేందుకు తగుప్రయత్నాలు చేయబడుతున్నాయి. కొత్తకొత్త ప్రాంతాలలో నూనె, బొగ్గు కొరకై పరిశోధనలు జరుగుతున్నాయి. కొత్తకొత్త లోహపుగనులనేకం కనిపెట్ట బడ్డాయి. వీటిని కనిపెట్టుటలో స్థానికరైతులు, కష్టజీవులు ఉత్సాహంగా ప్రభుత్వానికిభోగట్టా యిచ్చి సహాయంచేస్తున్నారు. ఉదాహరణకు ఒక్క యీశాన్య చైనాలోనే స్థానీక ప్రజలు 3000 లోహాలు లభించే ప్రాంతాలను చూపెట్టారు. ఈ కొత్త గనులను తెరచుటకు తీవ్రకృషి జరుగుతూంది. ఈశాన్యచైనాలో అప్పుడే 14బొగ్గుగనులు ప్రారంభించబడ్డాయి. మిగతాదేశంలో 26 బొగ్గుగనులు తిరిగి తెరవబడ్డాయి. ఇంకా అనేకం ప్రారంభించ బడుతున్నాయి.

ఈ విధంగా అనేక కొత్త కొత్త పరిశ్రమల నభివృద్ధి చేయడం మూలంగా యీ సంవత్సరం పారిశ్రామికోత్పత్తి చాలా పెరుగుతుంది. 1952 తో పోలిస్తే ముడియినుము 14%, ఉక్కు-కడ్డీలు 23%, విద్యుచ్ఛక్తి 27%, నూనె 42%, సీసం, తుత్తునాగం వగైరా 39-54%, ఫ్యాక్టరీ, గనుల పరికరాలు 153%, యంత్రభాగాలు 34%, సిమెంటు 17%, నూలు 9%, బట్టలు 16%, కాగితం 6% ఎక్కువ ఉత్పత్తి చేయబడతాయి.

## 5. నవచైనా నాయకుడు - కార్మికవర్గం

"బానిస సమాజంలో సాంఘిక శ్రమ నిర్మాణం కర్ర భయంతో కొనసాగించబడుతుంది...... పెట్టుబడిదారీ సమాజంలో ఆకలి భయంతో కొనసాగించబడుతుంది......కమ్యూనిస్టు సమాజంలో - దీనికి మొదటిమెట్టు సోషలిజం - సాంఘిక శ్రమ నిర్మాణం భూస్వాముల, పెట్టుబడిదారుల పరిపాలనను కూలద్రోసిన శ్రమజీవులయొక్క స్వచ్ఛంద, చైతన్యపూరిత క్రమశిక్షణపైన ఆధారపడియుంటుంది. కాలం గడచినకొద్దీ యీ ఆధారం మరింత పెరుగుతూంటుంది."

— లెనిన్ "గొప్ప మార్పు" నుండి

నవచైనాలో విముక్తి అనంతరం గత మూడేండ్ల చరిత్రను పరిశీలించినట్లయితే చైనా కార్మికవర్గమూ, మొత్తం శ్రమజీవులందరూ స్వతంత్రులయ్యారనీ, వారియొక్క రాజకీయ చైతన్యమూ, క్రమశిక్షణా యినుమడించాయని రుజువవుతుంది. మూడేండ్ల కొద్దికాలంలో నవచైనా సాధించిన మహత్తర విజయాలకు మూలకారణం చైనాలోని కార్మికవర్గమూ,

తదితర శ్రమజీవులూ మావో యొక్క, చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క నాయకత్వం క్రింద అపరిమితోత్సాహంతోనూ సృజనాత్మక శక్తితోను పనిచేయడమే ననేది నిర్వివాదాంశం.

చైనా కార్మికవర్గం ఉత్పత్తిరంగంలో దేశభక్తిపూరిత అధికోత్పత్తి ఉద్యమంలోగాని, పొదుపు ఉద్యమంలోగాని, పరిశ్రమలలోని రిజర్వుశక్తుల నెత్తిచూపుటలోగాని, ఉత్పత్తిలో పోటీ ఉద్యమంలోగాని, ఉత్పత్తి ప్రమాణాలను పెంచుటలో గాని యెలాంటి వీరోచిత పాత్రను నిర్వహించారో యిదివరకే వివరించబడింది.

నవచైనా కార్మికవర్గం ఎందుకు యీ విధంగా తన యొక్క శక్తిప్రతిపత్తులను, తెలివితేటలను, సృజనాత్మక శక్తిని వెల్లడిస్తూంది? దీనికి కారణ మొక్కటే. స్వతంత్ర నవచైనాలో కార్మికవర్గం రాజ్యాంగ యంత్రంలో నాయకత్వం వహించే వర్గంగా తయారయింది. ఉత్పత్తి పెరుగుదలతోపాటు కార్మికవర్గంయొక్క భౌతిక, సాంస్కృతిక, జీవన స్థాయి ఎంతో పెరిగింది. ఇంకా పెరుగుతూంది. తమ దైనందిన జీవితానుభవంనుండి కార్మికవర్గం నవచైనాలో తమ హోదా ఏమిటో తెలుసుకుంటున్నారు. తమ ఆశయాలూ, ప్రభుత్వ ఆశయాలూ ఎలా ఒకటో అర్థం చేసుకోగలుగుతున్నారు. తత్ఫలితంగా ఉత్పత్తిని పెంచుటలోనూ, ప్రభుత్వ ప్రయోజనాలను కాపాడుటలోను తమయొక్క బాధ్యత ఎంత ఉందో గుర్తించారు. ఇదే నవచైనా కార్మికవర్గంయొక్క ఉన్నత వర్గ, రాజకీయ చైతన్యాలకు, అమూల్యశక్తికి మూలం.

నవచైనా కార్మికవర్గానికి యివ్వబడిన రాజకీయాధికారాలేమిటో చూద్దాం. చైనా ప్రజాతంత్రరిపబ్లిక్ అవతరించిన



మే డే నాడు కార్మికులు నూతనోత్సాహంతో సాగిపోతున్నారు

కొద్దికాలానికే, 1950 ఫిబ్రవరి 28 న కేంద్రప్రభుత్వం, ప్రభుత్వ ప్రజా పరిశ్రమలలో ఫ్యాక్టరీ నిర్వాహణా కమిటీల నిర్మాణం గురించిన ఒక శాసనాన్ని జారీచేసింది. దానిప్రకారం కార్మికు లకు, మేనేజిమెంటుకు సరిసమాన ప్రాతినిధ్యం గలిగిన కమిటీలు ఏర్పరచబడ్డాయి. 1950 జూన్ 29 న ట్రేడ్‌యూనియన్ చట్టం అమలు పరచబడింది. ఈ చట్టంలో కార్మికవర్గ ప్రజాసంస్థల యొక్క పాత్ర - అంటె నూతన ప్రజాస్వామిక రాజ్యాంగంలో ట్రేడ్‌యూనియన్లకు చట్టసమ్మతంగా గల హక్కులు, విధులు, బాధ్యతలు - నిర్దిష్టంగా నిర్వచించబడింది. వాటితోపాటు కార్మికవర్గంయొక్క ప్రాధమిక శ్రేయస్సుకు గ్యారంటీ యివ్వ బడింది. ఈ రాజకీయాధికారాల ప్రాప్తితో చైనా కార్మిక వర్గం ప్రభుత్వ పరిశ్రమలలోని అరాజకత్వ అవశేషాలకు, అభి వృద్ధి నిరోధక ఫ్యూడల్ విధానావశేషాలకు వ్యతిరేకంగా అవిరళ పోరాటం సాగించింది. పరిశ్రమలలో దాగియున్న విప్లవ ప్రతీఘాతుకశక్తుల నేరిపారవేయగలిగింది. ఇంకొక మాటలో చెప్పాలంటె పరిశ్రమలకు తానే అధినేతయింది.

ప్రయివేట్ పరిశ్రమలలోని కార్మికవర్గం యొక్క పరి స్థితికూడ పూర్తిగా మారిపోయింది. వాటిలో పనిచేసే కార్మి కులయొక్క రాజకీయహక్కులు, చట్టసమ్మతమైన ఆర్థిక హక్కులు పూర్తిగా కాపాడబడుతున్నాయి. కార్మికవర్గాన్ని ఏవిధంగా అణగగొట్టజూచినా లేక దోపిడీచేయజూచినా, అలాంటి పెట్టుబడిదారులు శిక్షార్హులౌతారు.

పరిశ్రమల అభివృద్ధితోపాటు కార్మికవర్గంయొక్క జీవన పరిస్థితులుకూడ క్రమానుగతంగా అభివృద్ధి చెందుతున్నాయి. ఈశాన్యచైనాలో కార్మికుల, ఉద్యోగస్థులయొక్క నిజమైన

జీతాలు 1949 లో 27% 1950 లో 12.5%, 1951 లో 15% పెరిగాయి. 1952 లో దేశం మొత్తంమీద కార్మికులయొక్క సగటు జీతాలు 1949 లో కంటే 60% నుండి 120% వరకు పెరిగాయి. అదేసంవత్సరంలో ప్రభుత్వ పరిశ్రమలలోను గనులలోను కార్మికులకు సరుకులరూపంలో యివ్వబడిన సగటు జీతాలు 1949 కంటె 75% ఎక్కువగా వున్నాయి. కార్మికులకివ్వబడుతున్న యితర సౌకర్యాలను కూడ లెక్కలోనికి తీసకుంటే వారికి గిట్టే మొత్తం జీతాలింకా ఎక్కువగా ఉంటాయి

జీతాలతోపాటు కార్మికుల జీవనవసతు లనేకవిధాలుగా అభివృద్ధి చేయబడ్డాయి. ఒక్క ఈశాన్యచైనాలోనే 26 లక్షల చదరపుమీటర్ల వైశాల్యముగల వసతిగృహాలు కార్మికుల కొరకు నిర్మించబడ్డాయి. 1952 తో ప్రారంభించి 3-5 సంవత్సరాల లోపల మొత్తం కార్మికవర్గానికంతకూ గృహావసతుల నిర్మాణం పూర్తిగావాలని కేంద్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ పథకం అతిచురుకుగా ఆచరణలో పెట్టబడుతూంది.

1951 ఫిబ్రవరి 26 న కేంద్ర ప్రజాప్రభుత్వం కార్మిక భీమాచట్టాన్ని అమలుపరచింది. 100 మంది కార్మికులకు మించి పనిచేస్తున్న ప్రభుత్వ, ప్రయివేట్ పరిశ్రమల కిదివర్తిస్తుంది. ఈ చట్టంలో ప్రసూతి, ముసలితనం, జబ్బులు, చావులు, దెబ్బలు, అశక్తత మొదలైన కార్మిక సమస్యలకు తక్షణ సహాయ సౌకర్యాలు నిర్ణయించబడ్డాయి. ఈ చట్టం దేశంలోని 30,20,000 మంది కార్మికులకు, వారి కుటుంబాలతో కలుపుకుంటే దాదాపు కోటిమందికి వర్తిస్తుంది. ఫాక్టరీలలోను, గనులలోను కార్మికుల సౌకర్యాలు చాలా అభివృద్ధి చేయబడ్డాయి. ఉదాహరణకు ప్రభుత్వ నిర్వహణలోని బొగ్గు

గనులలో భూగర్భంలో పనిచేసే కార్మికులకందరకు నిమిషానికి మూడు ఘనపు మీటర్లను మించి శుభ్రమైనగాలి లభించే యేర్పాట్లు చేయబడ్డాయి. ప్రమాదాలు, దెబ్బలు, చావులు చాలవరకు అరికట్టబడ్డాయి. దాదాపుఅన్ని ఫాక్టరీలలోను గనులలోను ఆసుపత్రులు, చికిత్సాకేంద్రాలు, విశ్రాంతిగృహాలు, నర్సరీలు ఏర్పాటు చేయబడ్డాయి. కార్మికుల బిడ్డలకొరకు దేశం మొత్తంమీద 1600 నర్సరీలు నెలకొల్పబడ్డాయి. బిడ్డలకు పాలుయిచ్చే తల్లులకు ప్రత్యేకగదులు నిర్మించబడ్డాయి. దేశం మొత్తంమీద 37 కార్మిక ఆరోగ్యకేంద్రాలు, ముసలివారికి, అశక్తులకు 14 ప్రత్యేక గృహాలు, తలిదండ్రులు లేని పిల్లలకు 3 అనాథ శరణాలయాలు నడుపబడుతున్నాయి. వీటివలన సహజంగానే కార్మికులయొక్క, ఉద్యోగస్థులయొక్క ఆరోగ్య పరిస్థితులు ఎన్నోరెట్లు చక్కబడ్డాయి.

కార్మికుల జీవితస్థాయితోపాటు వారి సాంస్కృతిక స్థాయి అతివేగంగా పెంపొందుతూంది. వారియొక్క సంస్కృతి, విజ్ఞానం, వినోదాలకోసం ప్రత్యేకంగా నిర్మించబడిన క్లబ్‌లు, నాటకశాలలు, సినిమాలు, రాత్రి పాఠశాలలు, పిల్లల పాఠశాలలు, తక్కువకాలపు మధ్యేకపు పాఠశాలలు వగైరాల సంఖ్య రానురాను పెరుగుతూంది. దేశం మొత్తంమీద ప్రస్తుతం 30 లక్షల 20 వేలమంది కార్మికులు హాజరవుతున్న 8,900 తీరికసమయపు పాఠశాలలు నడుపబడుతున్నాయి. 66 పెద్దపెద్ద సంస్కృతీ ప్రాసాదాలు, 5,100 పుస్తక భాండాగారాలు నెలకొల్పబడ్డాయి. 1952 జూన్ నాటికి 26,400 మంది కార్మికులకు సెలవుయిచ్చి సాంకేతికాధ్యయనం నిమిత్తం సాంకేతిక పాఠశాలలకు పంపించబడ్డారు.

చైర్మన్ మావో, చైనా కమ్యూనిస్టుపార్టీలయొక్క ఉజ్వల నాయకత్వం క్రింద నవచైనా బ్రహ్మాండమైన నిర్మాణ కార్యక్రమంలో పురోగమనం ప్రారంభించింది. "చైనాను శక్తివంతమైన పారిశ్రామిక దేశంగా నిర్మించాలి" అనే ఏకైక లక్ష్యంతో కార్మికవర్గం తీవ్ర కృషిచేస్తూంది. సోషలిజం సాధించాలనే అచంచలదీక్ష చైనా కార్మికవర్గం యొక్క హృదయాలలో హత్తుకుపోయింది. వారు దృఢవిశ్వాసంతోను, అనుపమ ధైర్యంతోను ముందుకు సాగిపోతున్నారు.

చైనా ప్రజానీకం శాశ్వతంగా ధరల అస్థిరత్వమనే పీడనుండి విముక్తి గావించబడింది. చైనాలో సుస్థిర ఆర్థిక నిర్మాణానికి అనువైన పరిస్థితులు సృష్టించబడ్డాయి. 1950 మార్చిలో టోకుధరలసూచీ 100అనుకుంటె 1950 డిశెంబరులో 88.60, 1951 సెప్టెంబరులో 101.30, 1951 డిశెంబరులో 100.30, 1952 జూన్‌లో 95.20 ఉంది. ఈ అంకెలు ప్రాథమికంగా ధరలు స్థిరపడినట్లు రుజువుచేస్తున్నాయి.

చైనా ప్రజాప్రభుత్వం ఉత్పత్తియొక్క, వ్యాపారస్థుల యొక్క, వినిమయదారులయొక్క ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొనే, ధరలను నిర్ణయిస్తూ వచ్చింది. ప్రస్తుతం కొన్ని పారిశ్రామిక వస్తువుల ధరలు యింకా ఎక్కువగా ఉన్నప్పటికీ, వివిధ ప్రాంతాలమధ్య కొంచెం ధరల తేడాలున్నప్పటికీ, కొన్ని చిన్న చిన్న పట్టణాలలో టోకు ధరలకు, చిల్లర ధరలకు కొంచెం తేడాలున్నప్పటికీ మొత్తంమీద ప్రాంతీయ, టోకు, చిల్లర ధరల నిర్ణయంగానీ; సరుకుల నాణ్యాన్నిబట్టి ధరల నిర్ణయంగానీ; వ్యాపార పంటల ఆహార ధరల నిర్ణయంగానీ; పారిశ్రామిక వస్తువుల ధరలు, వ్యవసాయిక వస్తువుల ధరల నిర్ణయం



దేశభక్తియుత ఉద్యమంలో కార్మికులు ఉత్పత్తి నధికంచేయుట

— సెంగ్-చింగ్-చూ చే కొయ్యపై చెక్కబడ్డ బొమ్మ
(వుడ్ కట్)

గానీ వొక దానికొకటి పెద్ద వ్యత్యాసం లేకుండ అదుపులో పెట్టడం జరిగింది.

సరియైన యీ ధరల విధానంవలన యీ క్రింది సత్ఫలితాలు కలిగాయి. పారిశ్రామికోత్పత్తికి, వ్యవసాయకోత్పత్తికి, ముఖ్యంగా వ్యాపారపంటల వుత్పత్తికి, ప్రత్తి, పొగాకు, జనపనార, ఉన్ని, టీ మొదలైన యెగుమతి సరుకుల ఉత్పత్తికి చక్కని ప్రోత్సాహం లభించింది. ఇతర కారణాలతో బాటు గత మూడేండ్లలోనూ ప్రత్తికి, ఆహార పదార్థాలకు మధ్య ధరల నిష్పత్తిని సరిగా నిర్ణయించడంవలన 1952 లో ప్రత్తి వుత్పత్తి 1949 కన్న మూడు రెట్లు పెరిగింది. తత్ఫలితంగా చైనాలోని బట్టల పరిశ్రమకు అవసరమైన ప్రత్తిని దిగుమతి చేసుకోనవసరం లేకుండా పోయింది. అదేవిధంగా పొగాకు వుత్పత్తి 1950 కన్నా 1952 లో మూడు రెట్లు పెరిగింది. పూర్వం పొగాకును దిగుమతి చేసుకునే చైనా యీ నాడు యెగుమతిచేసే స్థితిలో వుంది.

అలాగే వివిధ ప్రాంతాలమధ్య, టోకు, చిల్లర ధరల మధ్య వ్యత్యాసాలను సరిదిద్దడంవలన ప్రయివేటు వ్యాపారస్థులకు మంచి ప్రోత్సాహం లభించింది. వారు వివిధప్రాంతాలకు విరివిగా సరుకులను సప్లయిచేసేటట్లు చేసింది.

అదే విధంగా వినిమయ దారుల ప్రయోజనాలుకూడా రక్షింపబడ్డాయి. ఆహార పదార్థాలు, బట్టలు, బొగ్గువగైరాలే గాక ప్రజల నిత్యజీవితాని కవసరమైన అనేక యితర సరుకుల యొక్క చిల్లర ధరలనుగూడ స్థిరీకరించడం వలన వినిమయ దారులెంతో సౌఖ్యం పొందగలిగారు. చిల్లరవ్యాపారం చాలా భాగం యింకా ప్రయివేటువ్యాపారస్థుల చేతుల్లోనే ఉన్నప్పటికీ,

వీరి వ్యాపారాన్ని ప్రోత్సహిస్తూనే రెండవవైపున ప్రభుత్వం, వీరు ధరలనుపెంచి అమ్మకుండ తగిన కట్టుదిట్టాలు చేసింది. ప్రభుత్వమే స్వయంగా కొన్ని చిల్లర దుకాణాలను తెరచింది. తద్వార చిల్లర మార్కెట్ ధరలనుకూడ ఖాయిదాలో ఉంచ గలిగింది.

2. పట్టణాలు, పల్లెసీమలమధ్య వ్యాపారవిస్తరణ :— 1949 నుండి చైనా అంతర్గత మార్కెట్ క్రమంగా విస్తరిస్తూంది. మూతబడిన అనేక పాత వ్యాపారమార్గాలు తిరిగి తెరవబడ్డాయి. కొత్త వనేకం యేర్పడ్డాయి. వ్యాపార పద్ధతులలోనే కొత్త మార్పులు తీసుకురాబడ్డాయి.

సంవత్సరం మొత్తంమీద వ్యాపారంయొక్క పరిమాణం పెరుగుతూంది. 1950 లో అంతర్గత వ్యాపార పరిమాణం 100 అనుకుంటే 1951 లో 130 కి, 1952 లో 170 కు పెరిగింది. వ్యవసాయ సరుకులయొక్క, తదితర ముఖ్యావసర వస్తువుల యొక్క అమ్మకం రానురాను యెక్కువవుతూంది. గతమూడు సంవత్సరాలలోను యీ క్రింది టేబిల్ నిరూపిస్తున్నట్లు ఆహార పదార్థాలు నిరూపిస్తున్నట్లు, ఆహారపదార్థాలు, బట్ట, పెట్రోలియంల అమ్మకం 150%, తదితర ముఖ్యావసర పదార్థాల అమ్మకం 50% పెరిగాయి.

| వస్తువులు | 1950 లో మొత్తం అమ్మకం | 1951 లో మొత్తం అమ్మకం | 1952 లో మొత్తం అమ్మకం |
|---|---|---|---|
| వ్యవసాయసరుకులు, | | | |
| చేతి వృత్తి సరుకులు | 100 | 138.66 | 148.61 |
| ఆహారపదార్థాలు* | 100 | 170.21 | 271.28 |
| నూలు* | 100 | 131.90 | 171.43 |
| బట్టలు* | 100 | 167.27 | 245.76 |
| బొగ్గు | 100 | 115.80 | 141.86 |
| పెట్రోలియం | 100 | 108.90 | 262.67 |
| ఉప్పు | 100 | 142.35 | 152.89 |
| సిగరెట్లు | 100 | 112.06 | 149.41 |

పారిశ్రామికోత్పత్తిని, వ్యవసాయకోత్పత్తిని పునరుద్ధరించి, అభివృద్ధి చేయుటతోపాటు ప్రభుత్వ వ్యాపార కంపెనీల, సహకార సంఘాల సహాయంతో మార్కెటును పునరుద్ధరించబడినాయి. పల్లెసీమలు - పట్టణాల మధ్య వస్తుసరఫరాను పెంపొందించబడినాయి.

1950 వేసవి కాలం నాటికి సరుకుల ధరలు స్థిరపడి, నోట్లముమ్మరం మూలంగా ఏర్పడిన కల్పిత కొనుగోలుశక్తి అకస్మాత్తుగా అంతరించుటతో వ్యాపారం కొంతకాలంపాటు తాత్కాలికంగా ప్రతిష్టంభించింది. ఈ ప్రతిష్టంభన నంతమొందించుటకుగాను యీ దిగువ చర్యల తీసుకోబడ్డాయి.

---

* ప్రభుత్వం దేశం మొత్తంమీదగల మార్కెట్లకు సప్లయి చేసిన మొత్తాన్ని తెలియజేస్తాయి.

ప్రభుత్వ వ్యాపార కంపెనీలు చట్టబద్ధంగా పనిచేస్తున్న ప్రైవేటు పరిశ్రమలకూ, సంస్థలకూ సహాయం చేస్తూ వచ్చాయి. వారిదగ్గర నిల్వవున్న సరుకును కొనడం, ముడి సరుకును శుభ్రంచేసి ఇచ్చేందుకు కొన్ని జీవితావసరవస్తువులను ఉత్పత్తిచేసేందుకు ఆర్డర్లు యివ్వటం మొదలైన వాటి ద్వారా వాటికి ప్రోత్సాహం యివ్వడం జరిగింది. అలాగే ప్రభుత్వ వ్యాపార కంపెనీలు వ్యవసాయకోత్పత్తిని పెద్దయెత్తున కొనడంద్వారా రైతులను ప్రోత్సహించాయి. స్థానిక సరుకులను అమ్మటకు కొత్తకొత్త మార్కెట్లు తెరవబడ్డాయి. ఈ విధంగా మార్కెట్ ప్రతిష్టంభనను అరికట్టడం జరిగింది.

పట్టణాలు – పల్లెసీమలమధ్య వ్యాపారాన్ని అభివృద్ధి చేయాలంటే రైతాంగంయొక్క జీవిత పరిస్థితుల నభివృద్ధి చేయడం, వారి కొనుగోలుశక్తిని పెంచడం, తద్వారా వారు పారిశ్రామిక వస్తువులను కొనగలిగేటట్లు చేయడం అవసరం. ఇందు నిమిత్తం జాతీయ వస్తువులనే కొనడాన్ని ప్రోత్సహించుటలోనూ, వాటి అమ్మకాన్ని యెక్కువ చేయుటలోనూ నిల్వసరుకులకు మార్కెట్టు చూపించుటలోనూ, రైతాంగ, యొక్క ఆదాయాన్ని పెంచుటలోనూ ప్రత్యేక శ్రద్ధ చూపించబడింది. పల్లెటూళ్ళ కవసరమైన పారిశ్రామిక వస్తూత్పత్తి ప్రోత్సహించబడింది. ఉత్పత్తి ఖర్చులు తగ్గించుట, పొదుపుగా ఖర్చుపెట్టుటద్వారా పారిశ్రామిక వస్తువులు చౌకగా లభ్యమయ్యేటట్లు చేయబడ్డాయి. ఈ చర్యలద్వారా చైనాలోని పల్లెసీమలు పారిశ్రామిక వస్తువులకు విశాలమైన మార్కెట్‌గా తయారయ్యాయి.

అంతర్గత మార్కెట్ అభివృద్ధిగానిదే, పట్టణాలు - పల్లెసీమలమధ్య వ్యాపారం పెంపొందనిదే జాతీయార్థికాభి వృద్ధిని సాధించడం దుస్తరం. పారిశ్రామిక వస్తువుల అమ్మకాన్ని నిర్ణయించేది పల్లెసీమలే. రైతాంగంయొక్క కొనుగోలుశక్తి పెరుగుతూన్నంతకాలము పరిశ్రమలు తప్పనిసరిగా పెంపొందుతాయి. దీనిని దృష్టిలో ఉంచుకునే చైనా ప్రజా ప్రభుత్వం 1950 ఆఖరునుండి 1951 మధ్యభాగంవరకు పట్టణాల నుండి పల్లెసీమలకు, పల్లెసీమలనుండి పట్టణాలకు మధ్య నిరంతర వస్తు సరఫరాను పెంపొందించేందుకుగాను ఒక దేశ వ్యాపిత ఉద్యమాన్ని నడిపింది. ఈ ఉద్యమ ఆశయాలవివరణకు దేశవ్యాపితంగా అనేక మీటింగులు పెట్టబడ్డాయి. దాని ఫలితంగా 1951 లో 10 లక్షలకోట్ల యుయాన్ల విలువచేసే 14,000 వ్యాపార కాంట్రాక్టులు చేసుకోబడ్డాయి.

1952 లో పట్టణాలు - పల్లెసీమలమధ్య వ్యాపారాన్ని మరింత పెంపొందించేందుకు చైనాలో మరో ఫలప్రదమైన పద్ధతి అవలంబించబడింది. దేశవ్యాపితంగా అనేక వ్యాపార వస్తుప్రదర్శన లేర్పాటుచేయబడ్డాయి. దాదాపు అన్నిరాష్ట్రాల లోను, పరిపాలక ప్రాంతాలలోను, కౌంటీలలోనూ ఈప్రదర్శనలు జరుపబడ్డాయి. స్థానిక ప్రభుత్వశాఖలన్నీ యిలాంటి ప్రదర్శనాలకు పిలుపుల్నివ్వడమేగాక స్వయంగా నాయకత్వం వహించి నడిపాయి. ఆయా ప్రభుత్వశాఖలను సంబంధించిన వ్యాపార, ఆర్థికశాఖలు, పన్నుల బ్యూరోలు, కస్టమ్స్, రహదారీ, రవాణాశాఖలు యీ వుద్యమంలో చురుకుగా పాల్గొన్నాయి. ఆయా ప్రాంతాలలో ధరల హెచ్చుతగ్గులను సరిచేయుట, నెమ్మదిగా అమ్ముడుబోయే వస్తువులను కొనడం,

త్వరగా అమ్ముడుబోయే వస్తువులను విరివిగా సరఫరా చేయడం, వ్యాపారస్థులకు తక్కువవడ్డీ రేటుకు అప్పులివ్వడం, మార్కెట్‌పై ప్రభుత్వకంట్రోళ్ళు నడిపించడం మొదలైన చర్యలద్వారా యిటువంటి ప్రదర్శనలు జయప్రదమయ్యేటట్లు కృషిచేశాయి. వ్యాపార వస్తుప్రదర్శనలద్వారా వ్యాపారం 1952 లో మరింత విజృంభించింది. అసంపూర్ణమైన లెక్కలప్రకారం 1952 జులై నాటికే యీ ప్రదర్శనంలో 9,60,000 కోట్ల యుయాన్‌ల విలువగల వ్యాపారం చేయబడింది. 1952 మిగతా భాగంలో యింకా యెక్కువయ్యేటట్లుంది.

పల్లెటూళ్ళకు సమీపంలో వుండే పట్టణాలలోకూడా అనేక వ్యాపార వస్తుప్రదర్శన లేర్పాటు చేయబడ్డాయి. ఆవిధంగా రైతాంగం తమకు దగ్గరగావుండే పట్టణాలలో తమ వ్యవసాయ సరుకులనమ్మి పారిశ్రామిక వస్తువులు కొనుక్కునేందుకు అవకాశం కల్గించబడింది.

కొన్ని ప్రదర్శనలలో విదేశ వ్యాపారస్తులుకూడా వచ్చి వ్యాపార కాంట్రాక్టులు చేసుకోవడం గమనించదగినవిషయం. భవిష్యత్తులో యీ వ్యాపార ప్రదర్శనలు జాతీయ వ్యాపారాభివృద్ధికేగాక విదేశీ వ్యాపారాభివృద్ధికి కూడ దోహద మివ్వ గలవనుటలో సందేహము లేదు.

అంతేగాదు. ఈ ప్రదర్శనలు ఉత్పత్తికి, వినిమయానికి మధ్యగల వైరుధ్యాన్ని పరిష్కరించడంలోనూ, ఉత్పత్తి అభివృద్ధిని ప్రోత్సహించటంలోనూ, మార్కెట్టుపైన ప్రభుత్వ నాయకత్వాన్ని క్రమపద్ధతిలో నిర్మించుకోవడంలోనూ తోడ్పడ గల్గుతాయి.

3. ప్రయివేటు పారిశ్రామిక, వాణిజ్యసంస్థల పరిస్థితి చక్కబడుట :—గత మూడేండ్లలోను చైనాలో ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థ మిగతా అన్ని ఆర్థిక వ్యవహారాలపైన స్థిరమైన నాయకత్వాన్ని ఏర్పరచుకోగలిగింది. ప్రభుత్వ ఆర్థికవ్యవస్థ యొక్క సహాయంతో సహకార సంఘాలు విరివిగా అభివృద్ధి జెందాయి. ప్రయివేట్ పరిశ్రమలు, వాణిజ్యసంస్థలు ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థయొక్క నాయకత్వం క్రిందకు తీసుకురాబడ్డాయి. ఆ విధంగా నూతన ప్రజాస్వామిక ఆర్థిక నిర్మాణం జయప్రదంగా అభివృద్ధి అయ్యేందుకు పూర్తి గ్యారంటీ ఏర్పడింది.

అయితే దీని అర్థం ప్రయివేట్ పరిశ్రమలు, వాణిజ్య సంస్థలు అభివృద్ధియగుట కవకాశం లేదనిగాదు. దేశ సంక్షేమానికీ, ప్రజా జీవితానికి ఉపయోగపడే ప్రయివేటు పారిశ్రామిక, వాణిజ్య సంస్థలన్నీ చాలాకాలంపాటు కొంత అభివృద్ధి కాగలవు. అటువంటి సంస్థలకు ప్రభుత్వసహకారము, ప్రోత్సాహముకూడ ఉంటాయి.

విముక్తి అనంతరం నిజానికి శక్తివంతమైన ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థయొక్క నాయకత్వం క్రింద ప్రైవేటుపారిశ్రామిక వాణిజ్యసంస్థలు గణనీయంగా అభివృద్ధి చెందాయికూడా. పరిశ్రమల, వాణిజ్యాల సక్రమ పునర్నిర్మాణం ద్వారాను, సరుకుల యొక్క కేంద్రీకృత క్రయవిక్రయాలద్వారానూ, ప్రయివేటు పరిశ్రమలతో ప్రభుత్వం కాంట్రాక్టులు చేసుకోవడం, కొన్ని సరుకుల వుత్పత్తికి ఆర్డర్లు యివ్వడంద్వారానూ, ప్రైవేటు పెట్టుబడిదార్లతో కలిసి జాయింటుగా కొన్ని పరిశ్రమలను నిర్వహించుట ద్వారానూ, జాయింటుగా చర్చించి ధరలను నిర్ణయించుట ద్వారానూ, "వూఫాన్" ఉద్యమం ద్వారానూ

ప్రైవేటు పరిశ్రమలను నిర్ణీత పంధాలో సక్రమంగా నడిపించుట జరుగుతూంది.

విముక్తి అనంతరం సామ్రాజ్యవాదులపైన, నిరంకుశ పెట్టుబడిపైన ఆధారపడి, వారియొక్క స్వార్థప్రయోజనాల కుపయోగపడుతున్న పరిశ్రమలు, వాణిజ్యసంస్థలు మూాల బడ్డాయి. ధరల స్థిరీకరణతో చట్టా వ్యాపారం అంతరించింది. చట్టా వ్యాపారసంస్థలు యితర వ్యాపారపద్ధతులను స్వీకరించ వలసి వచ్చింది. ఈ విధంగా ప్రైవేటు పారిశ్రామిక, వాణిజ్య సంస్థల ప్రాధమిక నిర్మాణంలో మొదటిమెట్టు పూర్తయింది.

ఉత్పత్తిని పెంపొందించి, క్రమంగా మార్కెట్లను ప్లాను ప్రకారం నడిపించాలనే ధ్యేయంతో, 1950 మేలో కేంద్ర ప్రజాప్రభుత్వం పారిశ్రామిక వాణిజ్య సంస్థల నిర్మాణంలో మార్పులు తీసుకువచ్చి సరిదిద్దడం జరిగింది. ప్రభుత్వ సంస్థలు యిటు ప్రయివేట్ పరిశ్రమలను ప్రోత్సహిస్తూ కొన్ని నిర్ణీత సరుకుల ఉత్పత్తికి ఆర్డర్లు యివ్వడం, కాంట్రాక్టులు చేసు కోవడం; అటు వ్యవసాయక సరుకులను పెద్దఎత్తున కొని వేయడం; పట్టణాలకు, పల్లెసీమలకు మధ్య వ్యాపారాన్ని పెంపొందించడంద్వారా పునర్నిర్మించబడిన ప్రయివేట్ పరి శ్రమలు త్వరత్వరగా నిలదొక్కుకునే అవకాశాలు కల్పించ బడ్డాయి.

ఉదాహరణకు షాంఘై, టీన్‌ట్సీన్, పెకింగ్, వూహాన్ కాన్‌టన్, చుంకింగ్, సియాన్ నగరాలలో 1950 మొదటి భాగంలో 18,847 ప్రయివేట్‌సంస్థలు మూసివేయుట కనుమతి కోరితే 12,752 మాత్రమే బిజినెస్ లైసెన్సుల కనుమతి కోరాయి. కాని 1950 రెండవభాగంలో మూసివేయుట కను

మతి కోరిన సంస్థలు 6736 కు తగ్గిపోగా లైసెన్సులు కోరిన సంస్థలు 31,509 వరకు పెరిగాయి. తదనుగుణ్యంగానే 1950 రెండవ భాగంలో ప్రయివేట్ సంస్థలు సాగించిన వ్యాపారం బాగా పెరిగింది. 1951 లో ప్రభుత్వ పరిశ్రమలకు, ప్రైవేట్ పరిశ్రమలకుమధ్య శ్రమ విభజనను సరిచేయుటద్వారా, వాటి రెంటిమధ్య సహకారం మరింత పెంపొందడమేగాక ప్రయివేటు పరిశ్రమలు మరింత బాగుపడ్డాయి. ఉదాహరణకు పైనచెప్పిన పట్టణాలలోనే 1950 చివరిభాగంకన్న 1951 ఆఖరుకు ప్రైవేట్ పారిశ్రామిక వాణిజ్య సంస్థలయొక్క సంఖ్య 20% పెరిగింది. వీటిలో పారిశ్రామిక సంస్థలు 33%, వాణిజ్య సంస్థలు 15% పెరిగాయి.

ప్రభుత్వసంస్థలు, పరిశ్రమల్లోని అవినీతి, దుబారాతనం, నిరంకుశత్వం అనే "మూడు దుష్టశక్తుల"కు వ్యతిరేకంగా 1951 డిశెంబరులో "సాన్ ఫాన్" ఉద్యమం ప్రారంభించబడింది.

అదే సమయంలో ప్రైవేటు వ్యాపారరంగంలోని, ప్రభుత్వ సంస్థల్లోని, ప్రజాసంస్థల్లోని ఉద్యోగస్తులకు లంచాలు యిచ్చుట, పన్ను ఎగవేయుట, ప్రభుత్వఆస్తిని దొంగిలించుట ప్రభుత్వ కంట్రాక్టులలో మోసంచేయుట, ప్రయివేటు చట్టా వ్యాపారం నిమిత్తం ఆర్థిక సమాచారాన్ని దొంగిలించుట అనే "ఐదు దురాచారాల"కు వ్యతిరేకంగా "వూఫాన్" ఉద్యమం ప్రారంభించబడింది.

1952 లో "సాన్ఫాన్", "వూఫాన్" ఉద్యమాల ద్వారా ప్రైవేట్ పరిశ్రమల నిర్మాణం మరికొన్ని మార్పులకు గురైంది. పాత సామాజిక విధానంనుండి ప్రైవేట్ పరిశ్రమలకు అనేక అవలక్షణాలు సంక్రమించాయి. వాటి మూలంగా

కేశాభివృద్ధి అరికట్టబడింది. పై రెండు ఉద్యమాల ఫలితంగా ఆ అవలక్షణాలన్నీ బహిర్గతం గావించబడి పూర్తిగా నిర్మూలించబడ్డాయి.

ప్రభుత్వసంస్థలు, ప్రయివేటు సంస్థలు కలిసి చర్చించి, రూపొందించుకున్న సాధారణ కార్యక్రమం (Common Programme) ప్రకారం ప్రయివేటు పరిశ్రమలకు, వాణిజ్య సంస్థలకు ప్రభుత్వం యిచ్చే ఆర్డర్లపైన న్యాయమైన లాభాలు యివ్వాలని నిర్ణయించబడింది. ప్రయివేటు పరిశ్రమల పెట్టుబడిని, ఆయా స్థానిక నిర్దుష్ట పరిస్థితులనుబట్టి మామూలు పరిస్థితులలో యీ లాభాలు 10% మొదలు 30% వరకు ఉండవచ్చునని అంగీకారానికి రావడం జరిగింది. ఈ అంగీకారానికి ప్రయివేటుసంస్థలు హర్షించి ఆమోదించాయి. ప్రభుత్వం యిస్తున్న యీ ప్రోత్సాహం ఫలితంగా ప్రయివేటు సంస్థలు సక్రమంగా అభివృద్ధియగుట కవకాశ మేర్పడింది.

ప్రభుత్వ సంస్థలు ప్రైవేటు పరిశ్రమలకు, వ్యాపారస్తులకు ముడి సరుకును శుభ్రం చేసేందుకు, కొన్ని ప్రత్యేక సరుకుల నుత్పత్తి చేసేందుకు ఆర్డర్లు యివ్వడం, కాంట్రాక్టులు చేసుకోవడం వలన ప్రయివేటు పరిశ్రమలయొక్క, ప్రభుత్వ సంస్థలయొక్క సమిష్టి ప్రయోజనాలు సాధించబడుతున్నాయి. ఈ విధానం ఉత్పత్తిని ప్రోత్సహించి, మార్కెట్లను నిర్ణీత పంథాలో నిర్వహించుటకు తోడ్పడుతుంది. ప్రయివేటు పరిశ్రమలపైన ప్రభుత్వసంస్థల నాయకత్వాన్ని సుస్థిరం చేస్తూంది. అంతేకాదు. ముడిసరుకులను సంపాదించుటలోనూ, తయారైన సరుకుకు మార్కెటు సంపాదించుటలోనూ, ప్రయివేట్ పెట్టుబడిదారులు. వ్యాపారసులూ సాధారణంగా యెదుర్కొనే

కష్టాలను పరిష్కరిస్తుంది. వారియొక్క న్యాయమైన లాభా లకు గ్యారంటీ యిస్తుంది. పూర్వం అరాజకంగానూ, గుడ్డిగాను జరిగే ఉత్పత్తి దుష్ఫలితాలనుండి వారిని కాపాడుతుంది.

ఉదాహరణకు 1951 మార్చి-జూన్‌ల మధ్య కాలంతో పోలిస్తే, అదేకాలంలో ప్రభుత్వసంస్థలు షాంఘై నగరంలోని ప్రయివేటు ఫ్యాక్టరీలకు యిచ్చిన ఆర్డర్లయొక్క, వాటినుండి కొన్న సరుకులయొక్క విలువ 100% పెరిగింది. ప్రయివేటు పరిశ్రమల మొత్తం వర్తకంలో యిది 80%. షాంఘైలోని 7000 ఫ్యాక్టరీలకు పైగా ప్రభుత్వసంస్థలు ఆర్డర్లుయిచ్చాయి. అలాగే టీన్‌ట్సీన్ మొదలైన నగరాలలోని ప్రయివేటుసంస్థల వ్యాపారంలో 60% వరకు ప్రభుత్వసంస్థలతోనే జరిగాయి.

భవిష్యత్తులోకూడా ప్రయివేట్‌పరిశ్రమలు జాతీయార్థిక నిర్మాణానికి అనుగుణ్యంగా నడచినట్లైతే, తమ పరిశ్రమల మేనేజిమెంటును సక్రమంగా నిర్వహించగలిగినట్లయితే "ఐదు దురాచారాలకు" లోనుగాకుండా ఉన్నట్లయితే అవి మరింత అభివృద్ధి కాగలుగుతాయి. ప్రజాప్రభుత్వం చైనాయొక్క ఐక్య ఆర్థిక ప్రణాళిక ననుసరించి (సాధారణ కార్యక్రమంలో 37 వ అంశంప్రకారం) వ్యాపారరంగంలో ప్రయివేట్ వ్యాపారానికి కొంత స్వేచ్ఛయిచ్చింది. దేశీయ, విదేశవ్యాపారాలలోనూ, పట్టణాలకు-పల్లెసీమలకు మధ్యజరిగే వ్యాపారంలోను ఆమేరకు ప్రయివేట్ వ్యాపారస్థులను ప్రోత్సహిస్తుంది. వారిని నిర్మాణ రూపంలో నడుపుతుంది. ఈ విధంగా ప్రయివేటు వ్యాపార సంస్థలు తమ వ్యాపారాన్ని పెంపొందించుకోడానికి విస్తృత అవకాశాలు కల్పించబడ్డాయి.

4. మైనారిటీ జాతులమధ్య వ్యాపారాభివృద్ధి :— మైనారిటీజాతుల ప్రాంతాలకు, దేశంలోని అన్యప్రాంతాలకు మధ్య వ్యాపారాన్ని పెంపొందించేందుకు, మైనారిటీ జాతుల ప్రజలు ఉత్పత్తిని ఎక్కువచేసుకునేందుకు, వారియొక్క జీవితస్థాయిని అభివృద్ధి పరచేందుకు ప్రజాప్రభుత్వ ఆదేశానుసారం ప్రభుత్వ వ్యాపారసంస్థల అధికారులు మైనారిటీ జాతుల ప్రాంతాలలో చిల్లరదుకాణాలను, క్రయశాలలను (Purchasing Stations), ముడిసరుకును శుభ్రంచేసే యంత్రాగారాలను నెలకొల్పారు. ఆ ప్రాంతాలతో వ్యాపారం చేసేందుకు సంచారక వ్యాపారదళాలను (Mobile trade teams) పంపించారు. మైనారిటీజాతుల ప్రాంతాలలో గత మూడేండ్లలోనూ పైన వివరించినట్లు దాదాపు 1100 వ్యాపార యూనిట్లకుపైగా నెలకొల్పబడ్డాయి. ఈ వ్యాపార యూనిట్లు ఆ ప్రాంతాలలోని పశువులు, పాలు, స్థానికవస్తువులకు మార్కెట్ చూపించుటలోనూ, ఉత్పత్తి సాధనాలను సమకూర్చి పెట్టడంలోనూ, సహకార సంఘాలను యేర్పరచి అభివృద్ధి చేయుటలోనూ, స్థానిక ప్రయివేటు వ్యాపారసంస్థలతో చేతులుకలిపి వ్యాపారాన్ని విస్తరింప చేయుటలోనూ పూర్తి సహకారాన్ని యిస్తున్నాయి. 1951 ఆగస్టులో కేంద్ర ప్రజాప్రభుత్వం వివిధజాతులమధ్య వ్యాపారాభివృద్ధి మార్గాలను చర్చించేందుకుగాను ఒక జాతీయ మహాసభను పిలిచింది. దీనిఫలితంగా మైనారిటీజాతుల వ్యాపారం మరింత ఎక్కువైంది.

మైనారిటీ జాతుల వ్యాపారాన్ని పెంపొందించేందుకుగాను ప్రభుత్వ వ్యాపారసంస్థలు మొట్టమొదట ఆ జాతులు వృత్తిచేసేపాలు, వెన్న, పశువులు వగైరాల అమ్మకపుధరలను

పెంచాయి. ఆ విధంగా పూర్వం ఆ ప్రాంతాలకు – మిగతా ప్రాంతాలకు మధ్య జరుగుతున్న అన్యాయపు మారకపు విధానానికి స్వస్తిచెప్పడం జరిగింది. ఉదాహరణకు విముక్తి కి పూర్వాని కన్నా 1951 డిశెంబరునాటికి చింగై రాష్ట్రంలోని సైనింగు ప్రాంతంలో మారకపురేట్లు ఎలా పెరిగాయో – విముక్తికిపూర్వం 100 కాటీలఉన్ని, యితరవస్తువులతో ఏ రేటున మారకమయ్యేదో, 1951 డిశెంబరులో ఏ రేటున మారక మయిందో – యీ క్రింది వివరాలు తెలియజేస్తాయి.

| | విముక్తికి పూర్వం | 1951 డిశెంబరులో |
|---|---|---|
| 100 కాటీలఉన్ని | 25 అడుగుల నూలుబట్ట | 303 అడుగుల నూలుబట్ట |
| ,, | 9 టీ ఉండలు | 84 టీ ఉండలు |
| ,, | 375 కాటీలజొన్న | 1312 కాటీలజొన్న |

ఇలాగే అన్ని ప్రాంతాలలోని మారకపు రేట్లు పెంచబడ్డాయి.

ఈ విధంగా ధరలను సక్రమంగా పెంచుటవలననూ, సరుకులను విరివిగా కొనడం వలననూ మైనారిటీ జాతుల ప్రాంతాలలోని సరుకుల ఉత్పత్తి పెంపకానికి దోహదమిచ్చింది. తత్ఫలితంగా అచటి ప్రజలయొక్క ఆదాయము, కొనుగోలు శక్తి, వారియొక్క జీవనస్థాయి పెరుగుతున్నాయి.

వాయువ్యచైనాలోని మైనారిటీజాతుల ప్రాంతంలోని పశుసంపద, పాడి వగైరాలు 1948 నాటికన్న 1951 లో 50% యెక్కువయ్యాయి. ఉన్ని వుత్పత్తికూడా అలాగే పెరిగింది. ఇన్నర్ మంగోలియాలో గత మూడేండ్లలోనూ పశువులసంఖ్య రెట్టింపు పెరిగింది.

వాయువ్యచైనా రాష్ట్రాలలోని పశువులకాపరుల కొను గోలుశక్తి గత మూడేండ్లలోను 6-7 రెట్లు పెరిగింది. ఇది వరకు యీ ప్రాంతాల ప్రజలు సాధారణంగా కొని ఎరుగ నటువంటి నూలుబట్టలు, తేయాకు, పువ్వు వగైరాలు ఈనాడు విరివిగా కొంటున్నారు. ఉదాహరణకు 1951 లోనే యీ ప్రాంతాలలో తేయాకు అమ్మకం 1950 కన్న 10 రెట్లు పెరిగింది. అలాగే సికాంగ్ రాష్ట్రంలో 1950 కన్న 1951 లో తేయాకు అమ్మకం 394% పెరిగింది.

సక్రమమైన జాతీయ వ్యాపారవిధానం ద్వారానూ, ప్రభుత్వ వ్యాపారసంస్థల సహకారంద్వారానూ, మైనారిటీ జాతుల ప్రాంతాలలో అనేక వ్యాపారకేంద్రాలు నెలగొల్ప బడడమేగాక స్థానికపరిశ్రమలు, వాణిజ్య సంస్థలుకూడా బాగా అభివృద్ధి చేయబడుతున్నాయి. ఉదాహరణకు ఒక్క చింఘైరాష్ట్రంలోనే 8 జిల్లాలలో ప్రయివేట్ పారిశ్రామిక వాణిజ్యసంస్థల సంఖ్య విముక్తికి పూర్వం 1662 ఉంటే, 1951 నాటికి 3944 కు పెరిగింది. అలాగే నింగ్‌సా రాష్ట్రంలో టింగ్ యు యాన్ యింగ్ ప్రాంతంలో వాటిసంఖ్య 49 నుండి 299 వరకు పెరిగింది.

మొత్తంమీద గత మూడేండ్లలోను నవచైనాలో సరుకులధరల పూర్తి స్థిరీకరణ ఫలితంగానూ, పట్టణాలు-పల్లె సీమల మధ్య వ్యాపారాభివృద్ధి ఫలితంగానూ, ప్రజలయొక్క, ప్రయివేట్ పెట్టుబడిదారుల యొక్క ప్రయోజనాలమధ్య సక్రమసంబంధాలు నెలకొల్పడం మూలంగానూ మార్కెట్లు రానురాను సరుకులతో కళకళలాడుతున్నాయి; పారిశ్రామిక వ్యవసాయకోత్పత్తులు క్రమంగా పెంపొందుతున్నాయి; చైనా

యొక్క దీర్ఘకాలపు భవిష్యదార్థిక నిర్మాణానికి చక్కని పునాదులు వేయబడ్డాయి.

# విదేశీ వ్యాపారం

ఇతరరంగాలలో వలెనే విదేశీవ్యాపార రంగంలోకూడా నవచైనా బ్రహ్మాండమైన విజయాలను సాధించింది. తన విదేశీ వ్యాపారంయొక్క అర్థవలస అధీన స్వభావానికి స్వస్తి చెప్పింది. సమానవాదాలు, పరస్పర ఉపయోగకరమైన పద్ధతిలో విదేశీవ్యాపారంలో నూతనసంబంధాలను నెలకొల్పు కుంది. అనేక సంవత్సరాలుగా చైనాయొక్క దిగుమతులు ఎగుమతులకన్నా చాలా యెక్కువగా ఉంటూవచ్చాయి. కాని యీనాడు రెండూ సరిసమానం చేయబడ్డాయి. ఈమధ్య అమెరికా సామ్రాజ్యవాదులు విధించిన వ్యాపార దిగ్బంధ నాన్ని జయప్రదంగా బద్దలుచేయగలిగింది.

చంగ్-కై-షేక్ దుండగీంద్ర పరిపాలనాకాలంలో చైనాయొక్క దిగుమతులు యెగుమతులకన్న చాలా యెక్కువగా ఉండేవనేది జగద్విదితమే.

చంగ్-కై-షేక్ పరిపాలన ఆఖరిరోజులలో దిగుమతులు ఎగుమతులు కూడా బాగా తగ్గిపోయాయి. విముక్తి అనంతరం నవచైనా ప్రభుత్వం చైనాయొక్క విదేశీవ్యాపారాన్ని అతి త్వరగా పునరుద్ధరించి అభివృద్ధిచేయగలిగింది. 1950 నాటికే విదేశీవ్యాపార పరిమాణం బాగా పెరిగింది. 1951 నాటికి అది రెట్టింపైంది. దీనితో ఎగుమతి దిగుమతులు సరిసమాన మయ్యాయి.

ఇదిచూచి ఓర్చలేని అమెరికన్ సామ్రాజ్యవాదం కొత్తగా యేర్పడిన నవచైనా ప్రభుత్వాన్ని పురిటిలోనే ఆర్థికంగా దెబ్బతీయాలనే తలంపుతో వ్యాపార దిగ్బంధనాన్ని అమలు జరిపింది. ఈ దిగ్బంధనాన్ని చూచి నవచైనాప్రభుత్వం బెదరిపోతుందని తలచింది. కాని చాలపొరపాటుపడింది. ఈ దిగ్బంధనం ఫలితంగా నవచైనా దెబ్బతినలేదుసరిగదా చైనా పైగా తన ఆర్థిక వ్యవస్థయొక్క వలస అధీన స్వభావానికి సత్వరమే స్వస్తి చెప్పి, స్వతంత్ర పథంలో పురోగమించుటకు తోడ్పడింది. ఈదిగ్బంధనంవల్ల చైనా యేమాత్రమూ నష్టపడలేదని, కాగా అమెరికన్ సామ్రాజ్యవాదులకు భయపడి చైనాతో వ్యాపారం చాలించుకున్న దేశాలుమాత్రమే అనేక ఆర్థిక యిబ్బందులకు గురౌతున్నాయని చరిత్ర ఋజువుచేసింది. ఆ దేశాలే యెగుమతి దిగుమతుల వ్యాపారంలో వొడుదుడుకులకు, డాలర్ల కొరతకు క్రమానుగతంగా పెంపొందుతున్న ఆర్థిక సంక్షోభానికి గురికావలసి వచ్చింది. తమ ఆర్థికసంక్షోభం నుండి తప్పుకోవాలంటే మామూలు అంతర్జాతీయ వ్యాపార సంబంధాలు కొనసాగించడం, ముఖ్యంగా చైనాతో వ్యాపార సంబంధాలను పునఃస్థాపించుకోవడం అవసరమని గుర్తిస్తున్నాయి. ఎందువల్లనంటే అనేక దేశాలలో ఉత్పత్తి అవుతున్న పారిశ్రామిక వస్తువులు, ముడిపదార్థాలు చైనాయొక్క అభివృద్ధికి అవసరం. చైనాలాంటి పెద్దదేశం వీటిని చాలా పెద్ద ఎత్తున కొనగలుగుతుంది. ఆ విధంగా అనేక దేశాలకు చైనా పెద్ద మార్కెట్ కాగలుగుతుంది. కాని అమెరికా సామాన్యమైన పారిశ్రామిక వస్తువులను, ముడిపదార్థాలనుకూడ యుద్ధావసర పదార్థాలుగా నామకరణంచేసి వాటిని చైనా కమ్మే

గూడదనే నిషేధం పెట్టడంవలన ఆయా దేశాలు వ్యాపార స్వాతంత్ర్యాన్ని కోల్పోయి ఆర్థిక సంక్షోభానికి గురిగాక తప్పడంలేదు.

కాని యీ దిగ్బంధనంవలన చైనామాత్రం ఎటువంటి డాలర్ కొరతకుగాని, ఆర్థిక సంక్షోభానికిగాని గురికాలేదు. ఇకమీదట కాదుకూడాను. పైగా చైనాయొక్క ఉత్పత్తి, ఆర్థిక నిర్మాణం నిరంతరం విస్తరిస్తున్నాయి.

చైనాయొక్క విదేశీ వ్యాపారం విస్తరించుటకు కారణ మేమిటి ? ఏ సూత్రాల ననుసరించి చైనా విదేశీవ్యాపారాన్ని కొనసాగిస్తూంది ? అనేవి తెలుసుకోవడ మవసరం. -

సరిసమాన హోదాలో, పరస్పరం ఉపయోగకరంగా వుండే పద్ధతిలో చైనా యితర దేశాలతో వస్తు మారకపు ఒడంబడికలద్వారా వ్యాపారం సాగిస్తోంది. ఇదే చైనాయొక్క వ్యాపారానికి మూలసూత్రం. దీనివల్ల అనేక ప్రయోజనా లున్నాయి. మొదటిది : ఒడంబడికలు చేసుకునే యిరుపక్షా లకూ యిది ప్రయోజనకరమే. తమ తమ దేశాలలో అధికంగా లభించే వస్తువులను మారకం వేసుకోవచ్చు. రెండవది : అమెరి కన్ డాలర్ల కొరత లేక స్టర్లింగ్ కొరత అనే సమస్యే వుదయిం చదు. డాలర్ల వేటలో ప్రజాజీవితాన్ని దెబ్బకొట్టవలసిన అవ సరం లేకుండా పోతుంది. చైనా యీ పద్ధతిలోనే అనేక దేశాలలోని వ్యాపారస్థులతోనూ, పారిశ్రామికాధిపతులతోనూ వ్యాపార ఒడంబడికలు కుదుర్చుకుంది. ఆగ్నేయఆశియాలోని ఇండియా, పాకిస్తాన్, బర్మా, ఇండోనేసియా, సిలోన్ మొద లైన దేశాలతో యిదే పద్ధతిలో వ్యాపార ఒడంబడికలు చేసుకుంది. దీనివలన డాలర్ల, స్టెర్లింగుల బాధలేకుండా,

సామ్రాజ్యవాదుల మార్కెట్ దోపిడీకి గురిగాకుండా, సరస మైన ధరలను, ఆదేశాల్లో అధికంగా లభ్యమయ్యే పదార్థాలను తాను తెచ్చుకుని, తనదేశంలో అధికంగా లభ్యమయ్యే పదార్థాలను వారికి పంపించడంవల్ల యిరుపక్షాలూ లాభదాయకంగా వ్యాపారం కొనసాగించ గలిగాయి.

చైనాయొక్క విదేశవ్యాపారంలో అధికభాగం సోవియట్ యూనియన్, ప్రజాతంత్రదేశాలతోనే జరుగుతూండడం గమనించ దగిన విషయం. దీనికికారణం ఆదేశాలు ఎటువంటి షరతులు లేకుండ సరిసమానహోదాలో పరస్పరం ఉపయోగకరమైన పద్ధతిలో చైనాతోవస్తుమారకపు ఒడంబడికలద్వారా వ్యాపారం కొనసాగించడమే. వెనుకబడిన దేశాలను పారిశ్రామికంగా అభివృద్ధి కానీయకుండ, తమకు ముడిపదార్థాలు మాత్రమే చౌకగా ఉత్పత్తిచేసి యిచ్చేస్థితిలో అట్టిపెట్టి, అసమాన హోదాలో వ్యాపారం కొనసాగించే విధానం సామ్రాజ్యవాదులది. కాని సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ ప్రజాస్వామికాలలో చేసేవ్యాపారానికిట్టి షరతులు లేకపోగా, వెనుకబడిన దేశాల ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడేవిధంగానే ఒడంబడికలు చేసుకోబడుతున్నాయి. చైనాలో అధికంగా లభ్యమయ్యే ముడిసరుకులకు బదులు యీ దేశాలు, చైనా పారిశ్రామికాభివృద్ధి కవసరమైన వ్యవసాయక, పారిశ్రామిక యంత్రాలను విరివిగా సప్లైచేస్తున్నాయి. వీటిసహాయంతో చైనాత్వరితగతిని వెనుకబడిన వ్యావసాయక దేశంనుండి శక్తివంతమైన పారిశ్రామికదేశంగా పురోగమించుటకు అవకాశా లేర్పడ్డాయి. గత మూడేండ్లలోనూ యీ దేశాలతో చైనాయొక్క వ్యాపారం విపరీతంగాపెరిగింది.

ఉదాహరణకు 1950 లో యీదేశాలతో వ్యాపారం చైనా యొక్క మొత్తం వ్యాపారంలో 26% మాత్రమే వుండేది. 1951 లో 61% కు, 1952 లో దాదాపు 70%కు పెరిగింది.

చైనా యేదేశంతోనైనా పైనచెప్పిన పద్ధతులలో వ్యాపారం చేయుటకు తన సంసిద్ధతను ప్రకటించింది. పశ్చిమ దేశాలతో వ్యాపారానికికూడ సిద్ధంగానే వున్నది. సోవియట్, తూర్పుయూరపుదేశాలతో చైనా వ్యాపారం చేయుటవలన పశ్చిమ దేశాలతో వ్యాపారం సన్నగిల్లుతుందనే తప్పుడు అభిప్రాయన్ని ఖండిస్తూ వచ్చింది. 1949 లో ప్రజాప్రభుత్వ మేర్పడిన క్రొత్తలో నిజానికి పశ్చిమదేశాలతో చైనాయొక్క వ్యాపారం కొంత అభివృద్ధి చేయబడింది. కాని అమెరికా సామ్రాజ్యవాదులు విధించిన దిగ్బంధంమూలంగా దీనికి అవాంతరం గలిగింది. ఐనా ఆదిగ్బంధం అమలులో ఉండగానే 1952 ఏప్రిల్‌లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ ఆర్థిక మహాసభ సందర్భంలో చైనా ప్రతినిధివర్గం బ్రిటన్, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, హాలండ్, బెల్జియం, ఇటలీ, స్విడ్జర్‌లాండ్, ఫిన్లండ్, సిలోన్, ఇండొనీషియా, పాకిస్తాన్ దేశాలకు సంబంధించిన పారిశ్రామిక వాణిజ్య ప్రతినిధులతో 22.4 కోట్ల అమెరికన్ డాలర్ల విలువచేసే వ్యాపార ఒడంబడికలు చేసుకోవడం జరిగింది. దీనినిబట్టి ప్రజాచైనా పైనవివరించిన షరతుల పైన ఏదేశంతోనైనా సమానహోదాలో వ్యాపారం చేయుటకు సంసిద్ధంగా ఉన్నదని రుజువవుతుంది.

చైనాయొక్క ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించి ఉత్పత్తి నభివృద్ధిచేయడం, ప్రజా జీవితస్థాయి కొనుగోలుశక్తి క్రమానుగతంగా పెంపొందడం మూలంగా చైనాయొక్క ఎగుమతి

శక్తి, దిగుమతి డిమాండు పెరిగాయి. అంతేకాదు. యీనాడు చైనా ఎగుమతిచేయగల సరుకులయొక్క, దిగుమతి చేసుకోగల సరుకులయొక్క సంఖ్య, రకాలుకూడా పెరిగాయి. ఉదాహరణకు పూర్వం చైనా బియ్యం, ప్రత్తి, పొగాకు, రామీ (Ramie) నోకసంచులు మొదలైనవి పెద్ద మొత్తాలలో దిగుమతి చేసుకోవలసి వచ్చేది. ఈనాడు వీటిలో స్వయంసమృద్ధిని సాధించడమేగాక కొన్నింటిని యెగుమతికూడా చేయగల్గుతూంది. ఉదాహరణకు 1951 లో భారతదేశానికి 66,000 టన్నులకుపైగా బియ్యాన్ని, 4,50,000టన్నుల కాయొలింగును యెగుమతి చేసింది. అలాగే అనేక కొత్తసరుకులను ముఖ్యంగా యంత్రాలను, పారిశ్రామిక వస్తువులను విరివిగా యితరదేశాల నుండి కొనగలుగుతుంది.

# 4

# వర్తక, వాణిజ్యాల అభివృద్ధి

## కుమింటాంగ్ చైనాలో ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నమగుట

దీర్ఘకాలంగా సాగిన అభివృద్ధి నిరోధక కొమింటాంగ్ పరిపాలన ఫలితంగానూ, పది సంవత్సరాలకు పైగా జరిగిన నిరంతర దారుణ యుద్ధ ఫలితంగానూ చైనాయొక్క ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోయింది.

1949 లో విముక్తి సాధించేనాటికి చైనా ఆర్థిక పరిస్థితి వర్ణింపనలవిగానంత దుర్భరంగా ఉంది. ఆనాటికి చెలామణిలో ఉన్న కాగితపు కరెన్సీ, రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం కన్న 1768 లక్షల రెట్లు ఉంది. ధరల సూచిక అంతకన్న దారుణంగా పెరిగిపోయింది. యుద్ధానికి పూర్వంకన్న 13,88,420కోట్ల రెట్లు పెరిగిపోయింది.

ఉదాహరణకు ఒకతనిదగ్గర 10,000 చైనా డాలర్లుంటె ఆనాడు అతనికి దానితో ఒక అగ్గిపుల్లకూడా వచ్చేదిగాదు.

రోజురోజుకూ ధర ఎలా పెరిగిపోతూ ఉండేవో యీక్రింది ఉదాహరణ తెలియజేస్తుంది. 1949లో "చైనా మన్ త్లీ రెవ్యూ" అనే పత్రిక వెల ఒకవారం 10 లక్షల డాలర్లు ఉన్నది. రెండవ వారంలో దాని వెల 20 లక్షల డాలర్లకు, మూడవ వారంలో 40 లక్షల డాలర్లకు పెరిగిపోయింది. నాలుగవ వారంలో యింకా పెరుగుతూండనగా షాంఘై నగరం విముక్తిగావింప బడింది.

జీతాలు చెల్లించినరోజున చూడాలి హడావుడి. కుమింటాంగ్ చైనా అంతటా గుమాస్తాలు వగైరా పెద్దపెద్ద ట్రంకుపెట్టెలు ఆఫీసుకు మోసుకుపోయి వానినిండా జీతం క్రింద యిచ్చిన నోట్లకట్టలు నింపి వెనువెంటనే హడావుడిగా మార్కెట్టుకు పోయేవారు. అచట తమ నోట్లిచ్చి బంగారం, వెండి పౌను నాణాలు, వినిమయసరుకులు, లేక అమ్మకానికి ఏవస్తువు దొరికితే ఆ వస్తువు (తమ కవసరమైనా లేకపోయినా సరే) కొనేసేవారు. అలా చేయకపోతే సాయంత్రానికి ధరలు మరొక లక్షో, పదిలక్షలో డాలర్లు యెక్కువైపోతాయని భయం. ఉదాహరణకు జీతాలిచ్చే ఒకరోజున ఒక గుమాస్తా ఆలస్యంగా పెకింగ్‌లో చైనా ఎంపోరియంకు పోయాడట. అచట సరుకులన్నీ అయిపోతే, పెన్సిలిన్ యింజక్షన్ల డబ్బా ఒకటుంటే కొనుక్కుపోయాడు. ఆ పాడునోట్లకన్నా ఏదో యొకసరుకు - అవసరమున్నా లేకపోయినా - దగ్గరుంటే మంచిదని అభిప్రాయం.

తత్ఫలితంగా కోమింటాంగ్ ప్రభుత్వ నోట్లంటేనే చైనా ప్రజలకు విశ్వాసం పోయింది. మొత్తం మార్కెట్టులో, 40 వ వంతు మాత్రమే దానిక్రింద ఉండేది. మిగతా

మార్కెట్టులో విదేశీ కరెన్సీయే ప్రధానమారక సాధనంగా ఉండేది. 1948 ఆగస్టులో కొమింటాంగ్ ప్రభుత్వంజారీచేసిన (బంగారపు) యువాన్ నోట్లు, సంవత్సరం తిరగకముందే పనికి మాలిన చిత్తుకాగితాలుగా మారిపోయాయి.

ఇలాంటి పరిస్థితులలో ప్రతియొక్కరూ సరుకులను దాచడమనేది తప్పనిసరి పరిణామమవుతుంది. చట్టావ్యాపారం సర్వవ్యాపితమూ, సర్వసామాన్యమూ అయింది. తుదకు నిజాయితీపరులైన వర్తకులు, పారిశ్రామికులూ కూడా చట్టా వ్యాపారం చేయక తప్పనిపరిస్థితి ఏర్పడింది. చైనాయొక్క ఆర్థికవ్యవస్థ యావత్తూ కుళ్ళిపోయింది. ప్రజాజీవితం విపరీతంగా క్షీణించిపోయింది.

విముక్తి అనంతరం నవచైనా ప్రభుత్వాన్ని సహజంగానే యితర కర్తవ్యాలతోపాటు నోట్లముమ్మరాన్ని అరికట్టడం, ధరలను స్థిరీకరించడం, చట్టా వ్యాపారాన్ని నిషేధించడం, పరిశ్రమలను, వాణిజ్యాన్ని యధాస్థితికి తీసుకురావడం మొదలైన ప్రధాన కర్తవ్యాలు కూడా ఎదుర్కొన్నాయి. ఈకర్తవ్యనిర్వహణలో నవచైనా ప్రభుత్వం క్రమానుగతంగా అనేక చర్యలను తీసుకుని అపూర్వవేగంతో ఆరు మాసాలలోనే అఖండవిజయాలను సాధించింది.

## 1. నోట్ల ముమ్మరాన్ని అరికట్టి ధరలను స్థిరపరచుట

కేంద్ర ప్రజాప్రభుత్వం ఏర్పడకపూర్వమే విముక్త ప్రాంతాలలో నోట్ల ముమ్మరాన్నరికట్టి ధరలను స్థిరపరచేందుకు కొన్ని ప్రాథమిక చర్యలు తీసుకోబడ్డాయి. విముక్త

ప్రాంతాలలో ఆయా ప్రాంతీయ ప్రభుత్వాలు బ్యాంకులను స్వాధీనపరచుకుని, కరెన్సీని స్థిరపరచి, చట్టా వ్యాపారాన్ని నిషేధించాయి. భూమిపన్నును కొత్తగానిర్ణయించి ఆప్రకారం ఖచ్చితంగా వసూలుచేయ నారంభించాయి. రవాణాసౌకర్యాలను వెంటనే మరమ్మతుచేసి పనిచేయించ నారంభించాయి. ఫాక్టరీల నన్నింటిని పునరుద్ధరించి ఉత్పత్తిని కొనసాగించాయి. ఒక్క ఫాక్టరీకూడా మూతపడి ఉండకుండా చూచాయి.

1949 అక్టోబర్ నాటికి చైనా ప్రధాన భూభాగమంతా విముక్తి అయింది. కేంద్రప్రజాప్రభుత్వం నెలకొల్పబడింది. కేంద్రప్రజాప్రభుత్వం ఏర్పడిన మరుక్షణంనుండే ఆర్థికవ్యవస్థను చక్కబెట్టేటందుకు పూనుకోవడం జరిగింది.

1949 లో యింకా అటూయిటూ ఊగిసలాడుతున్న ధరలను నిలబెట్టేందుకు ప్రభుత్వం మొట్టమొదటి చర్యగా చట్టా వ్యాపారస్థులపైన దాడిని ప్రారంభించింది. కాని ప్రధాన చర్యలు 1950 లో ప్రారంభమయ్యాయి. 1950 మార్చి మూడవ తేదీన ప్రజాప్రభుత్వం మూడు ముఖ్యాంశాలుగల ఒక ప్రధానశాసనాన్ని జారీచేసింది.

(i) బడ్జట్ ఆదాయవ్యయాలను సరిపుచ్చుట : 1949 లో ప్రభుత్వ బడ్జట్‌లోటు 60% వరకు ఉండేది. ఈ లోటును పూడ్చుటకు ప్రభుత్వం యీక్రింది చర్యలు తీసుకుంది.

(అ) ఖర్చులు తగ్గించబడ్డాయి. ఆఖరుకు సైనికఖర్చులు కూడా విపరీతంగా తగ్గించబడ్డాయి.

(ఆ) ప్రభుత్వ సంస్థలన్నీ, సైనిక యూనిట్లతోసహా, తమతమ ప్రాంతాలలో ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనాలని

ఆదేశించ బడ్డాయి. ఈ కార్యక్రమం ప్రత్యక్షంగా కేంద్ర ప్రభుత్వ అజమాయిషీ క్రింద జరుగుతుంది.

(ఇ) ప్రభుత్వ ఉద్యోగస్థులు, గుమాస్తాలు తదితర జీతగాండ్రందరకూ జీతాలు తగ్గించుకుని పనిచేయవలసిందిగా విజ్ఞప్తి చేయబడింది. ఈ విజ్ఞప్తి ననుసరించి అందరూ తక్కువ జీతాలకు పనిచేయ నారంభించారు. అందువల్లనే చైనాలో యీ నాటికీకూడా ప్రభుత్వ ఉద్యోగస్థుల జీతాలు మామూలు రైతుల, పారిశ్రామిక కార్మికుల ఆదాయాలకన్నా కూడా తక్కువగా ఉన్నాయి.

(ఈ) ఈ విధంగా ఖర్చులు తగ్గించుటతోపాటు ఆదాయాన్ని పెంచడంకూడ జరిగింది. నూతన భూమిపన్ను విధానాన్ని అవలంబించి, భూమిపన్నును సరుకులరూపంలో వసూలుచేయడం ఫలితంగా వ్యావసాయకాదాయం పెరిగింది. రవాణా సౌకర్యాలభివృద్ధి యగుటవలననూ, ధరలు స్థిరపడుతూండుటవలననూ యితర పన్నులనుండి వచ్చేఆదాయంకూడా పెరిగింది.

ఖర్చులుతగ్గి ఆదాయం కొంత పెరిగినప్పటికీ యింకా 1950 బడ్జట్‌లో 18.7% లోటు ఉండిపోయింది. ఈలోటును పూడ్చేందుకు నోట్లు అచ్చువేయడానికి పూనుకోక, ప్రభుత్వం, ప్రజావిజయపు అప్పు అని పేరుతో 20 కోట్ల యూనిట్ల విలువ గల ప్రభుత్వ బాండులు జారీచేసింది. (ఒక్కొక్క యూనిట్ విలువ ఒక వెండిడాలర్‌తో సమానం) ఈ బాండులవిలువ సరుకులరూపంలోనే వసూలు చేయబడింది. (ఒక్కొక్క యూనిట్=సుమారు 7½ పౌనుల బియ్యం, 2 పౌనుల గోధుమ పిండి, 4 గజాలసన్నబట్ట, 20 పౌనులబొగ్గు). ఈ బాండ్లు

వడ్డీతో సహా 5 సంవత్సరాలలో వాయిదాలమీద ఆనాటి సరుకుల ధరలనుబట్టి చెల్లించబడతాయి. ఈ బాండుల మూలంగా 1950 బడ్జట్‌లోటు చాలవరకు పూడ్చబడింది. ఈ చర్యలద్వారా ఆరుమాసాలు దాటకముందే బడ్జట్‌లోటును సరిపుచ్చడం జరిగింది.

(ii) శాసనంలోని రెండవ అంశం, జీవితావసర సరుకుల యొక్క సప్లై, డిమాండులను సరిపుచ్చడం: వీటిలో ప్రధాన మైనవి ఆహారపదార్థాలు, ప్రత్తి, బొగ్గు, ఉప్పువగైరాలు. ప్రభుత్వం వీటియొక్క మొత్తాలను సక్రమంగా అంచనావేసి ప్లానుప్రకారం పంపకం సాగించ బూనుకుంది.

అన్నింటిలోకి ముఖ్యమైనవి ఆహార పదార్థాలు. భూసంస్కరణలు, తదితర వ్యవసాయక సంస్కరణల వలన ఆహారోత్పత్తి బాగాపెరిగింది. రైతులకు భూమిపన్ను చెల్లించాక తమ వ్యవసాయకోత్పత్తిలో 83%-87% వరకు ఆదాయం మిగులుతుంది. అందువల్ల గ్రామసీమలలో ఆహారపదార్థాల లోటు అనేదే ఉండదు. పైగా రైతులు కొంతభాగాన్ని అమ్ముకోగలిగే స్థితిలో ఉన్నారుకూడా.

పోతే యిక పట్టణాలు, తరుగుప్రాంతాల సమస్య మిగిలింది. పట్టణాలలో 8 కోట్లమందికి, తరుగు ప్రాంతాలలో 4 కోట్ల మందికి ఆహార పదార్థాలు సరఫరా చేయవలసి వుంటుంది. దీనిని పరిష్కరించేందుకుగాను ప్రభుత్వం భూమి పన్నులో 90% వరకు వ్యవసాయక సరుకులరూపంలో వసూలు చేయ సంకల్పించింది. వ్యవసాయక పన్నురూపంలో వచ్చిన ఆహారపదార్థాలలో మిలిటరీకి, పాఠశాలలకు, తదితర ప్రభుత్వ శాఖలకు అవసరమైనది మినహాయించగా ప్రభుత్వం చేతులలో

యింకా 4 కోట్ల 50 లక్షలమంది ప్రజలకు ఒక సంవత్సరం వరకు సరిపడ ఆహారపదార్థాలు మిగిలాయి. 1950 ఆఖరుకు 10 కోట్ల ప్రజలకు సంవత్సరానికి సరిపడా స్టాకు ప్రభుత్వం చేతుల్లోఉంది. ఈ మిగులు నంతటినీ ప్రభుత్వం పట్టణాలకు తరుగుప్రాంతాలకు తరలించింది. ఇదికాక పట్టణాలలో రైతులు ప్రత్యక్షంగా అమ్ముకున్న ఆహారపదార్థాలు కూడా కలిపితే దేశంలో ఎవరికీ తిండికొరత అనేది వుండదు. అలాగే బొగ్గు వగైరాలు కూడా పథకం ప్రకారం పంపకం సాగించింది.

వీటితోపాటు పూర్వం నోట్లముమ్మరకాలంలో ప్రతి కుటుంబమూ అనేక రకాలైన జీవితావసర సరుకులను దాచి పెట్టడం జరిగింది. అవన్నీ నెమ్మదిగా ప్రజలకు నచ్చచెప్పి, వారి సహకారంతో బయటికి లాగడంతో జీవితావసర సరుకులకొరత దాదాపు తీరిపోయింది.

(iii) శాసనంలో మూడవ అంశం: ప్రభుత్వ బ్యాంకింగ్ సంస్థలలో రొక్కపు జమా. ఖర్చులను సరిపుచ్చుట: రొక్కపు లెఖ్ఖ (Cash account) అంతా చైనా ప్రజాబ్యాంకు (కేంద్ర ప్రభుత్వ బ్యాంకు) యొక్క అజమాయిషీ క్రిందకు తీసుకురాబడింది. ఖర్చులన్నీ కరెన్సీ అచ్చువేయడం ద్వారాగాక, ఆదాయంనుండే భరించే విధానమవలంబించ బడింది. ఇది జరగాలంటే బ్యాంకులలో రొక్కపు డిపాజిట్ల పరిమాణం పెరగాలి. అందుకుగాను ప్రభుత్వసంస్థలు, సైనిక సంస్థలు, పాఠశాలలు, కళాశాలలు వగైరాలు తమకుచేరిన రొక్కాన్ని మూడురోజులకుమించి తమదగ్గర ఉంచుకోకూడదని, బ్యాంకులలో డిపాజిట్ చేయాలని నిర్ణయించబడింది. సాధారణ డిపాజిటర్లను ప్రోత్సహించేందుకుగాను డిపాజిటర్లు

తమకిష్టంవచ్చినపుడు తిరిగి తీసుకోవచ్చని, సరుకుల ధరలు పెరిగితే యింక ఎక్కువ మొత్తంకూడ తీసుకోవచ్చని హామీ యివ్వబడింది. ఈ పద్ధతివలన బ్యాంకులలో డిపాజిట్ల మొత్తం బాగా పెరగడంతో ఆ ధనాన్ని బ్యాంకులు అనేక కార్యక్రమాలకు ఖర్చుపెట్టగలిగే స్థితికి వచ్చాయి. కేంద్ర ఆర్థికమంత్రి వర్గాని కవసరమైనపుడల్లా ధనాన్ని యివ్వగలిగేస్థితికి వచ్చాయి. తత్ఫలితంగా ప్రభుత్వం తన పునర్నిర్మాణ కార్యక్రమాలకు అదనపు నోట్లు అచ్చువేయవలసిన అవసరంలేకుండా పోయింది. ఖర్చులన్నీ ఆదాయంలోనుండే భరించ గలిగే పరిస్థితి వచ్చింది.

పైన వివరించిన విధానంద్వారా చైనా ప్రజాబ్యాంకు కరెన్సీ చలామణిని అదుపులోపెట్టి, ద్రవ్యమార్కెట్‌ను స్థిర పరచ వీలుగల్గింది.

మరొక ముఖ్య చర్యతీసుకోబడింది. బంగారపు ఎగుమతి నిషేధించబడింది. నోట్లముమ్మరం రోజులలో మార్కెట్‌లో చాలా బంగారం ఉండేది. కాని అది విదేశాలకు ఎగుమతి చేయడం ప్రారంభించబడింది. నూతన ప్రజాప్రభుత్వం దాని ఎగుమతిని నిషేధించింది. ప్రజలు అవసరమైతే తమ బంగారాన్ని తాము అట్టిపెట్టుకోవచ్చు. దానిని అమ్మదలచుకుంటె సరసమైన ధరలకు బ్యాంకులకు అమ్మాలి. అంతేగాని, విదేశాలకు ఎగుమతిచేయ వీలులేదని శాసనం చేయబడింది.

దీనితోపాటు విదేశీకరెన్సీ చలామణికూడా నిషేధించబడింది. నోట్లముమ్మరం రోజులలో చైనాకరెన్సీకన్నా విదేశీ కరెన్సీయే-అమెరికన్ డాలర్లు, హాంగ్‌కాంగ్ డాలర్లు, బ్రిటిష్ పౌనులు - ప్రధానమారకపు సాధనంగా ఉండేవని పైననే

వివరించబడింది. నూతన ప్రభుత్వం మార్కెట్‌లో విదేశీకరెన్సీ వాడకాన్ని పూర్తిగా నిషేధించింది. దానితో మార్కెట్‌లో నుండి విదేశీకరెన్సీ అదృశ్యమైపోయింది. ఆ కరెన్సీని ప్రభుత్వం వసూలుచేసి అవసరమైన విదేశసరుకులను తెప్పించుటకు వినియోగించింది.

<u>బ్యాంకుల స్పెక్యులేషన్ కూడా నిషేధించబడింది.</u> నూతన ప్రజాప్రభుత్వ మేర్పడేనాటికి దేశంలో 800 కు పైగా బ్యాంకులు స్పెక్యులేషన్ వ్యాపారాన్ని సాగిస్తూవుండేవి. ప్రభుత్వం దీనిని నిషేధించి ఆ బ్యాంకులపైన నిఘా ఏర్పాటు చేసింది. ఏదైనా బ్యాంకు స్పెక్యులేషన్ సాగించినట్లయితే దానిని వెంటనే మూసివేయడం జరిగింది. దీనితో బ్యాంకులు ధరలను స్థిరపర్చుటలో ప్రభుత్వానికి తోడ్పడేటట్లు చేయబడ్డాయి.

పైన వివరించిన చర్యలన్నింటి ఫలితంగా 1950 మార్చి నుండి ధరలు క్రమంగా స్థిరపడుతూ వచ్చాయి. స్థిరపడటమే గాదు. చట్టావ్యాపారమూ, నోట్లముమ్మరమూ అధికంగా వుండేరోజులలో ప్రదర్శితమైన కల్పిత కొనుగోలుశక్తి, ఒక్కసారిగా అంతరించడంతో కొద్దికాలంవరకు ధరలుపడిపోయాయి కూడా! దానితో అదివరకు చట్టావ్యాపారంద్వారా లాభాలు గడించిన స్థానికబ్యాంకులు, మారకపుషాపులు మూతబడిపోయాయి. గత పది సంవత్సరాల నుండి సరుకులను దాచివేస్తూ వచ్చిన వర్తకులు, పారిశ్రామికులు ఆర్థికయిబ్బందులకు, మార్కెట్ యిబ్బందులకు గురి అయ్యారు. తమ ధనాన్ని, సరుకులను బయటపెట్టక తప్పిందిగాదు.

# 5

# సహకారోద్యమం

ప్రజాతంత్ర రిపబ్లిక్ ఏర్పడిన నాటినుండి చైనాలో సహకారోద్యమం త్వరితగతిని వ్యాపించింది. సహకారోద్యమం మరేదేశంలోను యింత పెద్దయెత్తున యింత త్వరగా విస్తరించ లేదనుట నిస్సందేహం. 1952 వ సంవత్సరం రెండవ అర్థభాగంలో తీసిన లెఖ్ఖలప్రకారం, దేశం మొత్తంమీద 10,60,00,000 సభ్యులుగల్గిన 36,482 సహకార సంస్థలు పనిచేస్తున్నాయి. వీటిలో 9,54,60,000 (అంటే 20.14% గ్రామీణజనాభా)సభ్యత్వంగల గ్రామీణ సప్లై అండ్ మార్కెటింగ్ సంస్థలు 31,953 నెలకొల్పబడ్డాయి. 3340 పట్టణవినిమయదారుల సహకారసంస్థలు — వీటిసభ్యత్వం 1,10,00,000. ఇవి ముఖ్యంగా పెకింగ్, టీన్‌ట్సిన్, షాంఘై, హాంకో, ముక్డెన్, కాన్‌టన్, చుంకింగ్ వగైరా నగరాలలో — పనిచేస్తున్నాయి. 2,00,000 సభ్యత్వంగల 1076 పారిశ్రామిక ఉత్పత్తిదారుల సహకారసంఘాలు ఉన్నాయి. వీటితోపాటు 1,08,000 సభ్యత్వంగల్గిన యితర సహకార సంఘాలుకూడా ఉన్నాయి.

నవచైనాలో సహకారోద్యమం యింతత్వరగా వ్యాప్తి చెందుటకు కారణాలేమిటి?

(i) నవచైనా ప్రజాప్రభుత్వం ప్రజలయొక్క ఆర్థిక వ్యవస్థలో సహకార ఆర్థిక విధానాన్నొక ప్రజోపయోగకరమైన ప్రధానాంగంగా గుర్తించింది. అందువల్లనే సాధారణ కార్యక్రమంలో స్పష్టంగా యిలా చెప్పబడింది.

సహకార ఆర్థికవ్యవస్థ, అర్థసోషలిస్టు స్వభావంగలిగిన ఆర్థికవ్యవస్థ. ప్రజలయొక్క మొత్తం ఆర్థికవ్యవస్థలో యిదొక ముఖ్యభాగంగా ఉంటుంది. ప్రజాప్రభుత్వం దీనిపట్ల ప్రత్యేక శ్రద్ధచూపించి దీని అభివృద్ధికి కృషిచేస్తుంది.

తదనుగుణ్యంగానే గతమూడేండ్లలోనూ ప్రభుత్వశాఖలన్నీ సహకారోద్యమం యెడల ప్రత్యేకశ్రద్ధ జూపించాయి. ఆ ఉద్యమానికి నిరంతరం సలహాలిస్తూ సరియైన నాయకత్వంవహించి నడపడమేగాక అవసరమైన సహాయాన్ని చేకూర్చాయి. ఉదాహరణకు ప్రభుత్వ వ్యాపారసంస్థలు సహకార సంఘాలకు టోకుబేరాలపైన 2% - 6% వరకు వట్టం యిస్తుంటాయి. అలాగే ప్రభుత్వ బ్యాంకు, సహకార సంఘాలకు ప్రభుత్వ వ్యాపార సంస్థలకన్న వడ్డీరేటు 10% తగ్గించి అప్పులు యిస్తుంది. ప్రభుత్వపన్నుల బ్యూరో వీటిపైన అమ్మకపుపన్ను, మిగతా వాటిమీదకన్న 20% తగ్గిస్తుంది. క్రొత్తగా ఏర్పడిన సంఘాలు ఒక సంవత్సరంవరకు ఆదాయపు పన్నునుండి మినహాయించ బడతాయి.

(ii) అమెరికా దురాక్రమణను ప్రతిఘటించి కొరియాకు సహాయం చేయడం, విప్లవ ప్రతీఘాతకుల నణచివేయడం,

వ్యవసాయ సంస్కరణల నమలుజరపడం అనే మూడు గొప్ప ఉద్యమాల ఫలితంగాను, ఆర్థిక పరిస్థితులను చక్కబరచి ధరలను స్థిరపరచడం మూలంగాను, వ్యావసాయిక పారిశ్రామికోత్పత్తిని పునరుద్ధరించి పెంపొందించడం మూలంగాను ప్రజల యొక్క కొనుగోలుశక్తి పెరిగింది. వీటితోపాటు రవాణా సౌకర్యాలు అభివృద్ధి అయ్యాయి. పట్టణాలు - గ్రామసీమల మధ్య సరుకుల సరఫరా ఎక్కువైంది. వీటన్నిటి ఫలితంగా సహకారోద్యమం త్వరితగతిని విస్తరించింది.

(iii) సహకార సంఘాలు అవలంబించిన సరియైన వ్యాపార విధానంకూడ వీటివ్యాప్తికి ఒక ప్రధాన కారణం. సహకార సంఘాలను గురించి వ్రాసిన వ్యాసంలో మావో సే-టుంగ్ ఇలా చెప్పారు :

"ప్రజలకు సేవచేయడమే సహకార సంఘాల ప్రధాన కర్తవ్యం. సహకార సంఘాలు నిరంతరం ప్రజలను గురించి ఆలోచించవలసి యుంటుంది. వారికోసం పథకాలు వేయవలసి యుంటుంది. వారి ప్రయోజనాలను నెరవేర్చడం మొట్టమొదటికర్తవ్యంగా భావించాలి. ఇదే కొమింటాంగుకు-మనకు మధ్యగల ప్రాథమిక భేదం. విప్లవంలో ఇదే కమ్యూనిస్టులకు ప్రారంభవిషయంగాను, అంతిమ ఆశయంగాను ఉంటుంది. గత మూడు సంవత్సరాలలోను చైనాలోని సహకార సంఘాలు మావో సూచించిన యీ సరియైన విధానాన్ని మనస్ఫూర్తిగా అమలుపరిచాయి. పెట్టుబడిదారీ వ్యవస్థలోవలె లాభాపేక్షతో గాక, ప్రజల శ్రేయస్సుకోసం పనిచేశాయి. తత్ఫలితంగా ప్రజల యొక్క అభిమానాన్ని చూరగొని అతివేగంగా అభివృద్ధి చెందాయి.

ప్రస్తుతం అఖిలభారత సహకారసంఘాల సమాఖ్య యొక్క నాయకత్వంక్రింద మూడురకాలైన సహకార సంఘా లేర్పడి పనిచేస్తున్నాయి. అవి గ్రామీణ సప్లై అండు మార్కె టింగ్ సంఘాలు, పట్టణ వినిమయదారుల సంఘాలు, పారి శ్రామిక ఉత్పత్తిదారుల సంఘాలు.

1. గ్రామీణ సప్లై అండ్ మార్కెటింగ్ సహకార సంఘాలు:—ఈ సంఘాలు వాటిసభ్యులకు అవసరమైన జీవితావ సర సరుకులను, ఉత్పత్తి కవసరమైన పరికరాలను మార్కెట్ ధరలకన్న తక్కువధరలకు, ఎట్టి పరిస్థితులలోను వాటికి మించ కుండ సప్లైచేస్తాయి. అంతేగాదు. సభ్యులదగ్గరనుండి వ్యావ సాయక సరుకులను, తదితర సరుకులను సరియైన ధర యిచ్చి కొంటాయికూడ. దీనివలన పట్టణాలకు, పల్లెసీమలకు మధ్య క్రమబద్ధంగా ప్లానుప్రకారం సరుకులమారకం జరుగుతూంది. రెండవది ప్రభుత్వవ్యాపార సంస్థలతో యీ సంఘాలు సహక రించి పనిచేయుటవల్ల ధరల స్థిరీకరణలో యివి ప్రధానపాత్రను నిర్వహించ గలుగుతున్నాయి.

వ్యవసాయకోత్పత్తిని అభివృద్ధిచేయుటలో యివి ఎంతో తోడ్పడుతున్నాయి. వీటిలోని సభ్యులకు అదునులో మార్కె టింగ్ సౌకర్యాలు గ్యారంటీ చేస్తున్నాయి. సభ్యుల కవసర మైన విత్తనాలు, ఎరువులు, వ్యవసాయపరికరాలు, చీడపురుగు లను చంపే మందులు అవసరమైనప్పుడల్లా సప్లైచేస్తున్నాయి. ఉదాహరణకు 1952 లోనే దేశమంతటా యీ సంఘాలద్వారా రైతాంగానికి 20 లక్షల టన్నుల చెక్క ఎరువులు (Cake fertilizer) 3 లక్షల టన్నుల రాసాయనిక ఎరువులు అందించ బడ్డాయి. వీటి ఫలితంగా సాధారణంగా 50 లక్షలటన్నుల

ధాన్యం, 9,50,000 టన్నుల ముడిఉత్పత్తి అదనంగా ఉత్పత్తి అవుతుంది.

ప్రకృతి సిద్ధమైన విపత్తులకు గురియైన వారికి తోడ్పడే నిమిత్తం యీ సంఘాలు "ఉత్పత్తిద్వారా సహాయం"(Relief through production) అనే పద్ధతి నవలంబిస్తున్నాయి. ఉదాహరణకు 1949 లో ప్రభుత్వ ఆదేశాన్ననుసరించి ఉత్తర, దక్షిణ కియాంగ్సూ రాష్ట్రాలలోను, ఉత్తర అన్‌హ్వే, హోపె, పింగ్‌యుయాన్, షాంటంగ్, చహార్, లయోషి, ఛెకియాంగ్ రాష్ట్రాలలోను యీసంఘాలు రైతాంగాన్ని 200 రకాలైన చేతివృత్తిపనులు, తదితరపనులలో సమీకరించి, 10 లక్షలటన్నుల ఆహారధాన్యాల విలువకు సమానమైన సరుకును సృష్టించి ఆవిధంగా 10 లక్షల ప్రజలకు మూడునెలలు పోషించుకునేందుకు ఆస్కారం చూపించాయి. ఈ కృషి ఫలితంగా రైతాంగంలో సహజంగా ఈ సంఘాల యెడల ఆదరాభిమానాలు పెంపొందుతున్నాయి. నిజానికి ఈ కార్యక్రమ నిర్వహణలో అనేక క్రొత్త సహకార సంఘాలు నెలకొల్పబడ్డాయి.

ఈ సంఘాలయొక్క ఆశయం ప్రధానంగా రైతులయొక్క వ్యక్తిగత ప్రయోజనాలను, ప్రభుత్వముయొక్క, ప్రజలందరియొక్క సమిష్టి ప్రయోజనాలను మేళవించడమే. ఈ విధిని నిర్వర్తించుటకుగాను మూడు పద్ధతులవలంబించబడుతున్నాయి.

(అ) ముందుగానే కొనివేసే కాంట్రాక్టులు (Forward purchase contracts) :— ఈ పద్ధతిద్వారా ప్రభుత్వం రైతాంగం దగ్గరనుండి వ్యావసాయిక సరుకులను సహకార

సంఘాలద్వారా కొంటుంది. 1952 లో ప్రభుత్వం గ్రామీణ సప్లయి అండ్ మార్కెటింగ్ సహకారసంఘాలకు ఎరువులుకొనేం దుకు 1,50,00,000 యుయాన్‌లు, బొగ్గు, బట్ట వగైరా కొనేం దుకు 40,00,000 యుయాన్‌లు అప్పులు మంజూరు చేసింది. వీటిని రైతాంగానికిచ్చి వాటికి బదులు రైతులవద్ద నుండి యీ సంఘాలు 5 లక్షల టన్నుల ముడిప్రత్తిని పుచ్చుకునేందుకు కంట్రాక్టులు చేసుకున్నాయి. ఈ ప్రత్తి వసూలుకాగానే ప్రభుత్వానికి పంపించబడుతుంది. ఒక్కొక్కప్పుడు సహకార సంఘాలు రైతులకు ఉత్పత్తి ఖర్చులనిమిత్తం అప్పుపెట్టడం జరుగుతుంది. ఒక్కొక్కప్పుడు రైతులవద్దనుండి సహకార సంఘాలే వ్యవసాయక సరుకులను అప్పుగాపుచ్చుకుని, తర్వాత వారికి కావలసిన సరుకులను (తేలికగా దొరకనివాటిని) సప్లయి చేయడం జరుగుతుంది. సాధారణంగా యిలాంటి కంట్రాక్టులు వ్యావసాయకోత్పత్తి దారుల సహకారసంఘాలతోను, రైతుల పరస్పర సాహాయక దళాలతోను చేసుకోబడుట వలన యివి బలబడేందుకు దోహదమిస్తూంది.

(ఆ) లింకు కాంట్రాక్టులు (Link contracts) :— ఇవి సాధారణంగా సప్లై అండ్ మార్కెటింగ్ సహకార సంఘాలకు వ్యావసాయకోత్పత్తిదారుల సహకారసంఘాలకు, పరస్పర సాహాయక దళాలకు మధ్య చేసుకోబడే అగ్రిమెంట్లు. సప్లై అండ్ మార్కెటింగ్ సహకార సంఘాలు వ్యావసాయకోత్పత్తి దారుల సహకార సంఘాలకు, పరస్పర సాహాయకదళాలకు కావలసిన ప్రధానమైన పారిశ్రామిక, తదితర సరుకులను సప్లయిచేయుటకు, తిరిగి వాటికి యివి తమ వ్యావసాయకోత్ప త్తిని అనాడున్న మార్కెట్ ధరల కమ్ముటకు అగ్రిమెంటు

కుదుర్చుకుంటాయి. ఈ విధంగా అటునుండియిటు, యిటునుండి అటు ప్లాను ప్రకారం మారకం జరుగుతుంది.

(ఇ) సమిష్టి అమ్మకం :—కంట్రాక్టు చేసుకున్నాక రైతులు తమ సరుకును సహకారసంఘాలకు వ్యక్తిగతంగా గాక సమిష్టిగా అమ్ముతారు. ఈ పద్ధతివల్ల సహకారసంఘాల యొక్క సామర్థ్యం పెరుగుతుంది. ఉత్పత్తిదారుల కాలమూ, శ్రమ చాలవరకు కలసివస్తాయి. రైతాంగంలో సమిష్టితత్వం పెంపొందించబడుతుంది.

పైవాటినిబట్టి సప్లై అండ్ మార్కెటింగ్ సహకార సంఘాలు కేవలం వ్యాపారసంస్థలు మాత్రమే కావని, ప్లాను ప్రకారం పారిశ్రామిక, వ్యావసాయకసరుకుల మధ్యమారకాన్ని కొనసాగించే ఆర్థిక సంస్థలని తేలుతుంది. వీటి కృషి ఫలితంగా రైతాంగంలో క్రమానుగతంగా సమిష్టిగా ఆలోచించడం, సమిష్టిగా కృషి చేయడం అలవడుతూందని చూస్తాము. రైతులను సమిష్టి ఉత్పత్తి విధానంలోనికి కొనిపోవడానికి మొదటి మెట్టుగా పనిచేస్తున్నాయని చూస్తాము.

2. పట్టణ వినిమయదారుల సహకార సంఘాలు :— వీటియొక్క కర్తవ్యం ప్రధానంగా ఒక్కటే. వీటి సభ్యులకు — కార్మికులు, ఉద్యోగస్తులు, విద్యార్థులు, వృత్తిపనివారు మొదలైనవారికి — తక్కువ ధరలకు మంచిరకపు ఆహార పదార్థాలు, తదితర జీవితావసర సరుకులను సప్లయి చేయడమే. ఈ సంఘాలు నేరుగా గ్రామీణ సప్లయి అండ్ మార్కెటింగ్ సహకార సంఘాలతో సంబంధం పెట్టుకుంటాయి. వాటి దగ్గర నుండి పెద్దఎత్తున సరుకును కొని, పట్టణాలలోని తమ సభ్యులకు

మామూలు మార్కెట్‌లోకన్న 10%- 15% వరకు తక్కువ ధరలకు అమ్మతాయి.

3. పారిశ్రామిక ఉత్పత్తిదారుల సహకార సంఘాలు:— ఇవి ప్రధానంగా చేతివృత్తి పనివారల సహకార సంఘాలు చైనాలో లక్షలాదిగా చేతివృత్తులవారు ఉన్నారు. వీరు సాగించే ఉత్పత్తి మొత్తం ఉత్పత్తిలో గణనీయమైన భాగంగా ఉంటుంది. కాని వీరు దేశమంతటా వెదజల్లబడి యున్నారు. గతంలో చిన్న చిన్న పెట్టుబడులుకూడా లేక దళారుల దోపిడీకి, నవీన పరిశ్రమల పోటీకి గురియై చాలా నికృష్టమైన జీవితాన్ని గడుపుతూండేవారు. అటువంటి వీరిని నవచైనా ప్రభుత్వం సహకారసంస్థలలోనికి సమీకరించి బ్రతుకుబాట చూపించింది.

వీరికోసం ఏర్పరచబడిన యీ సహకారసంఘాల ధ్యేయం క్రమానుగతంగా వీరిని వ్యక్తిగత ఉత్పత్తి పద్ధతిలో నుండి సమిష్టి ఉత్పత్తికి, నవీన ఉత్పత్తి పద్ధతికి, నవీన పారిశ్రామికోత్పత్తి విధానానికి తీసుకొనిపోవడమే.

పారిశ్రామికోత్పత్తిదారుల సహకారసంఘాలు ప్రస్తుతం ప్రధానంగా రెండురకాలుగా ఉన్నాయి.

(అ) చేతివృత్తిపనిదారల సప్లయి అండ్ మార్కెటింగ్ సహకారసంఘాలు:—వీటిలోనిసభ్యులు తమతమ యిండ్ల దగ్గరే వ్యక్తిగతంగా ఉత్పత్తిచేస్తారు. అయితే సహకారసంఘం వీరి కవసరమైన ముడిపదార్థాలను సరిసమానంగా సర్దుతుంది. అలాగే వీరు ఉత్పత్తిచేసిన సరుకు మొత్తాన్నిబట్టి, నాణ్యాన్ని బట్టి సమానమైన కూలి యిస్తుంది. ఈ ప్రాథమికసంఘాలు శాశ్వతంగా ఉండేవిగావు. సరియైననాయకత్వముండి, ఉమ్మడి

నిధి పెరిగి, సభ్యులమధ్య సమిష్టితత్వం గనుక అలవడినట్లయితే యివి క్రమంగా సమిష్టి ఉత్పత్తిదారుల సహకారసంఘాలుగా పరిణతి చెందుతాయి. ఉదాహరణకు, షాంటంగ్ రాష్ట్రంలో వీఫాంగ్ అనేచోట మూడుసంవత్సరాలక్రితం వ్యక్తిగత చేనేత పారిశ్రామికుల సహకారసంఘ మొకటి ఆర్గనైజ్ చేయబడింది. ఈనాడు వారిని చైతన్యవంతులను చేసి, యితర సౌకర్యాలు కలిగించినపిమ్మట ఆ సంఘానికి 20 కోట్ల "యుయాన్"ల నిధితోపాటు సమిష్టిగా ఉత్పత్తిచేసేందుకు 20 విద్యుచ్ఛక్తితో నడుపబడుతున్న మరమగ్గాలుకూడా ఉన్నాయి.

(ఆ) కొన్ని సందర్భాలలో చేతివృత్తి పనివారలను నేరుగా సమిష్టి ఉత్పత్తిదారుల సహకారసంఘాలలో సమీకరించడంకూడా సాధ్యమే. ఉదాహరణకు షాన్సీరాష్ట్రానికి చెందిన కాన్హో అనే గ్రామంలో గంధకం ఉత్పత్తిదారుల సహకారసంఘం 1947 లో స్థాపించబడింది. 1950 లో పాత పరికరాలస్థానే చిన్నచిన్న బ్లాస్ట్‌ఫర్నేస్‌లు కొనడమేగాక, తన ఖర్చులను 38.6% తగ్గించుకుని, ఉత్పత్తిని 3.63 రెట్లు ఎక్కువ చేసుకుని, సభ్యుల ఆదాయాన్ని 7.2 రెట్లు పెంచుకోగలిగింది. విముక్తికి పూర్వం కాన్హో గ్రామస్థులు గోధుమపొట్టు, చెట్టు బెరడుతిని బ్రతికేవారు. అలాంటివారు యీనాడు కడుపునిండా తిండికి, ఒంటినిండా బట్టకు కొదువలేకుండ జీవిస్తున్నారు. సహకారసంఘం తమ గ్రామంలో యిద్దరు ఉపాధ్యాయులు గలిగిన ఒక పాఠశాలను నిర్మించుకుని, వయస్సువచ్చిన పిల్లలకందరకు చదువుచెప్పించుతూంది. అనేక వార్తాపత్రికలను తెప్పించి గ్రామస్థులంతా చదువుకుంటున్నారు. సహకార సంఘాలు సాధిస్తున్న విజయాల కిదొక చక్కని ఉదాహరణ.

గత మూడేండ్లలోను నవచైనాలో ప్రజాప్రభుత్వమూ, ప్రభుత్వసంస్థలు యిస్తున్న మద్దతుతో సహకార ఆర్థికవిధానం అతివేగంగా అభివృద్ధిచెందింది. చైనాలోని నూతన ప్రజాస్వామిక ఆర్థికవ్యవస్థలోని మిగతా నాలుగు రంగాలతోపాటు (ప్రభుత్వంచే నిర్వహించబడేరంగం, స్టేట్‌కాపిటలిస్టురంగం, ప్రయివేట్ కాపిటలిస్టురంగం, రైతులకు, చేతివృత్తుల వారికి చెందిని వ్యక్తిగత ఉత్పత్తిరంగం) యీ సహకార ఆర్థికరంగం ప్రముఖ పాత్రను నిర్వహిస్తూంది. దీనిపాత్ర రానురాను ఎక్కువవుతూంది.

చైనాజాతీయార్థిక వ్యవస్థయొక్క ప్రభుత్వ (సోషలిస్టు) ఆర్థికరంగం, సహకార ఆర్థిక రంగానికి నాయకత్వం వహించి నడుపుతూంది. సహకార సంఘాలద్వారా దేశమంతటా వెదజల్లబడియున్న వ్యక్తిగత ఉత్పత్తి దారులను సమీకరించి జాతీయ ఆర్థికపథకం ప్రకారం ఉత్పత్తికార్యక్రమం కొనసాగించేటట్లు చేయగలుగుతూంది. దీనివలన ప్రభుత్వం గట్టిపునాదులపైన పథకం ప్రకారం ఆర్థికనిర్మాణం కొనసాగించుటకు, క్రమేణా కొంతకాలం పిమ్మట దేశాన్నంతటని సోషలిస్టు విధానంలోనికి తీసుకుని వెళ్ళుటకు అంకురా లేర్పడ్డాయి.

# Bibliography


1. The Common Programme — Peking Publication
2. The Agrarian Reforms Law — do
3. New China's Economic Achievements 1949 – 1952 — do
4. Agriculture in New China — do
5. The Trade Union Law — do
6. China Stands Up — by R. K. Karanjia
7. China To-day — by Pandit Sundarlal
8. The Promise That is New China — by K. T. Shaw
9. Articles in Peoples China and New Times


